

"రాజాజీగావించిన ప్రతిపాదనలు భారతదేశం యొక్క ఐక్యతకు అనుగుణ్యమైనట్టివే. నేను ప్రకటించిన అభిప్రాయం కాంగ్రెసు తీర్మానంయొక్క మూలంతో ఏకీభవిస్తుంది. వివిధజాతుల ప్రజలను బలవంతముగా కలిపియుంచటం అహింసా సిద్ధాంతానికి వ్యతిరేకం"

15—7—44 —గాంధీజీ

రచయిత :

సజ్జద్ జహీర్

# కాంగ్రెస్-లీగ్ ఐక్యత

# కాంగ్రెసు-లీగ్ ఐక్యత

(3)

●

సజ్జద్ జహీర్

●

ప్రజాశక్తి కార్యాలయం
:: బెజవాడ ::

# ప రి చ య ం

హిందూ-ముస్లిం ఐక్యత నేడు దేశాన్ని ఎదుర్కొంటున్న సమస్య లలో అత్యంత ప్రధాన సమస్య. రాజకీయ ప్రతిష్టంభనా పరిష్కారానికి హిందూ-ముస్లిం ఐక్యత మూలం. ఐక్యతకు ప్రతిబంధకంగా ఉన్న దేమిటి ? ప్రధాన సిద్ధాంతాలపైన విభేదాలా అంటే కావు. అంతకన్న, పరస్పర అవిశ్వాసం అనుమానం ఈ ఐక్యతకు అడ్డువస్తున్నాయి. ముస్లిం లీగ్ సామ్రాజ్య వ్యతిరేక సంస్థయనిగాని, స్వతంత్రంకోసం పోరాడేపాత్ర వహించుతున్నదనిగాని సాధారణంగా కాంగ్రెసువాది నమ్మలేకపోతున్నాడు. ముస్లిములు కోరే స్వయంనిర్ణయహక్కు లేక పాకిస్థాన్ న్యాయమైన కోర్కెయనీ - అభివృద్ధికరమైన కోర్కెయనీ - జాతీయమైన కోర్కెయనీ నమ్మలేడు. ఇంతేగాదు; ఇన్ని సంవత్సరాలుగా కాంగ్రెసువాదులు యే ప్రజాస్వామ్యంకోసం, యేస్వాతంత్ర్యంకోసం ఇన్ని బాధలుపడ్డారో, ఇంత ప్రయాసపడ్డారో, ఆ స్వతంత్ర ప్రజాస్వామ్యాల వాంఛనే స్వయంనిర్ణయ హక్కు స్పష్టంగా ప్రదర్శించుతోందని కాంగ్రెసువాది గ్రహించజాల కున్నాడు. ప్రతి ప్రజాస్వామ్యవాది తప్పక చేయవలసిందేమిటి ? తన భవి ష్యత్తును తన యిష్టంవచ్చినట్లు స్వేచ్ఛగా మార్చుకొనే హక్కును - తన భవిష్యత్తుకు తానే బాధ్యుడయ్యే స్వతంత్రహక్కును — ప్రతిజాతికీ యివ్వా లని ప్రతి జాతీయస్వామ్యవాది నొక్కిచెప్పాలి. ఈ విధంగా నొక్కిచెప్పుట వల్లనే భారత దేశంలోని ముఖ్య పక్షాలలో పరస్పరసహకారం, స్నేహం, నమ్మకము ఏర్పడుతుందని కాంగ్రెసువాదులు గ్రహించుట లేదు.

ఇక ముస్లింలీగువారి సంగతిచూద్దాం. హిందువులు తమపై పెత్తనం చేస్తారనేభయం వాళ్ళను పీడిస్తోంది. కాని కాంగ్రెసు గొప్ప ప్రజాస్వామ్య ప్రాతిపదికపై నిలబడివుందనీ, వివిధపక్ష ప్రజల న్యాయమైన హక్కులను

సంపాదించడానికి కాంగ్రెసు నిరంతరం ప్రయత్నించుతోందనీ ముస్లింలీగు వారు గుర్తించుటలేదు. కాంగ్రెసు దేశభక్తులలో ముఖ్యులూ, ప్రధానులైన వారూ లీగ్‌వైపుకు మొగ్గారనీ వారు గ్రహించలేదు. లీగ్‌గనుక పాకిస్తాన్ కోర్కెను ప్రజాస్వామ్యకోర్కెగా, జాతీయకోర్కెగా ముందుబెట్టినట్లయితే దేశంలో రెండవ దేశభక్త సంస్థ అయిన తాను (లీగు), కాంగ్రెసునాయకులను విడుదల చేయాలనే విషయాన్ని తన ప్రజాస్వామిక కోర్కెల ఆందోళనలో ఒక అంశంగా పెట్టుకొన్నట్లయితే, తన ధ్యేయమైన స్వయం నిర్ణయహక్కువైపుకు పెద్ద అంగవేయగల్గుతుంది. ఇంతేగాదు; దేశంలో వ్యాప్తిచెందిన కరువు కాటకాలను అరికట్టగలిగే - జపాను దురాక్రమణదారులనుండి భారతదేశాన్ని రక్షించగలిగే - సంయుక్త జాతీయ ప్రభుత్వాన్ని సంపాదించుటకు యావత్ దేశానికి సహాయం చేసినవారౌతారు.

ఈ పుస్తకంలోని వ్యాసాలన్నీ "పీపుల్స్‌వార్" పత్రికనుండి పునర్ముద్రించబడ్డాయి. ఇటీవలి ముస్లింలీగు రాజకీయాలను పరిశీలించడానికి; భారతదేశ ముస్లింలలో జాతీయ చైతన్యం ఎలా ఉద్భవించిందో, దానిమూలమేమిటో ప్రజాస్వామ్య దృక్పథంనుండి చూడటానికి, ఈ పుస్తకంలో ప్రయత్నం జరిగింది. కాంగ్రెసు - లీగ్ దేశభక్తులు ఒకరికొకరు మరింత దగ్గరగా రాడానికి ఈ గ్రంథం ఉపయోగపడుతుందని ఆశించుతున్నాను.

బొంబాయి,
మార్చి 1944.

సజ్జద్ జహీర్.

# లీగ్ - కాంగ్రెసు ఐక్యతకు - - మహత్తరమైన అవకాశం

## జిన్నా - రాజాజీ ఉత్తర ప్రత్యుత్తరాలు

హిందూ-ముస్లిం సమస్యను పరిష్కరించడానికి రాజాజీ జిన్నాగారికి చేసిన కొన్ని సూచనలు పత్రికలలో ప్రకటింపబడ్డాయి. అవి మహాత్ముని ఆమోదాన్ని పొందాయి. అవి యేమంటే;

1. భారతీయుల సంపూర్ణ స్వాతంత్ర్య వాంఛను ముస్లింలీగ్ కూడా బలపర చాలి. తాత్కాలికంగా యేర్పడబోయే జాతీయ ప్రభుత్వ నిర్మాణానికి ముస్లింలీగ్ కాంగ్రెసుతో సహకారంచేయాలి.

2. దేశానికి పశ్చిమోత్తర భాగంలోను, తూర్పుభాగంలోను ముస్లిం ప్రజలు అధిక సంఖ్యాకులుగావున్న ప్రాంతాలకు సరిహద్దులు నిర్ణయించడానికి యుద్ధానంతరం ఒక కమిటీ నియమించబడాలి. ఆ విధంగా సరిహద్దుల నిర్ణయం జరిగిన ప్రాంతాలలో వయోజన వోటింగు పద్ధతిప్రకారంగాని, ఆచరణయోగ్యమైన మరే యితర వోటింగు పద్ధతి ప్రకారంగాని, అక్కడ నివశించే ప్రజలందరి అభిప్రాయం తెలుసుకోవాలి. ఆ యా ప్రాంతాలు భారతదేశంనుండి విడిపోవడమా ? లేక కలిసివుండడమా ? అనే సమస్యను నిర్ణయించేది అక్కడి ప్రజల అభిప్రాయం. మెజారిటీ అభిప్రాయం విడిపోవడానికి అనుకూలంగా వున్నట్లయితే, ఆ నిర్ణయం అమలుజరుగుతుంది. అయితే, అట్టిప్రాంతాలకు సరిహద్దులలోవున్న ప్రజలు యే ప్రభుత్వంలో చేరదలచుకుంటారో, ఆ ప్రభుత్వంలో చేరడానికి ఎట్టి ఆటంకం ఉండకూడదు.

3. ఇట్టి ప్రజా నిర్ణయానికి ముందు అన్ని పార్టీలవారు తమ అభిప్రాయాలను స్వేచ్ఛగా ప్రచారం చేసికొనవచ్చు.

4. ఏ ప్రాంతమైనా భారతదేశంనుండి విడిపోయినప్పుడు ఉభయ ప్రభుత్వాలు కలసి రక్షణ, వాణిజ్యం, రాకపోకల సౌకర్యాలు, మొదలైన ముఖ్య విషయాలపై పరస్పర ఒడంబడిక చేసుకోవాలి.

5. ప్రజలను ఒకచోటనుండి మరొకచోటికి మార్చడం ఆప్రజల ఇచ్ఛాను సారంగానే జరగాలి.

6. పరిపాలనాధికారాన్ని బ్రిటన్ భారతీయులకు ట్రాన్స్‌ఫర్ చేసినపక్షం లోనే పై షరతులు ఉభయ పార్టీలకు వర్తిస్తాయి.

## జిన్నాగారికి రాజాజీ వ్రాసిన లేఖలు

1944 ఏప్రిల్ 8 వ తేదీని రాజాజీ జిన్నాగారికి ఈ క్రిందివిధంగా జాబువ్రాశారు :

"ప్రియమైన జిన్నాగారూ : 1943 మార్చిలో నేను గాంధిజీతో సంప్రతించి నప్పుడు (21 రోజుల ఉపవాస సమయంలో) యీ సూచనలను గాంధీజీ అంగీక రించారు. అవి హిందూ - ముస్లిం సమస్యా పరిష్కారానికి పునాది. అవి అంద రికి న్యాయంగావుంటాయనే విషయంపై నేను మిమ్మల్ని ఒప్పించగలిగితే, గాంధీజీ తన అంగీకారాన్ని మీకు తెలియజేయవలసినదిగా నాకు అధికారం యిచ్చారు. రాజీకొరకు ప్రభుత్వం ఆయనకు యెట్టి అవకాశం యివ్వకుండా, ఆయనపైగల నిర్బంధాలను ఏమాత్రమూ సడలించడానికి పూనుకొననందున ఆయనతరపున నేను మీకు వ్రాస్తున్నాను. ఇందుమూలంగా హిందూ - ముస్లిం సమస్య పూర్తిగా పరిష్కరింపబడి, ప్రతిష్టంభన అంతమొందుతుందని ఆశిస్తున్నాను. పై షరతు లకు నేను గాంధీజీ అంగీకారాన్ని పొందినప్పుడు నా సంతోషం యింతా అంతా కాదు. ఈ సూచనలలో యెంత న్యాయం, యెంత సబబు ఉన్నదో చూచుటకై మీరు జాగ్రత్తగా వాటిని పరిశీలిస్తారని ఆశిస్తున్నాను. దేశంలో అన్నిమూలల విస్తారంగా వ్యాపించియున్న ప్రతిష్టంభనను అంతంజేయడంలో మీరు తోడ్పడుతా రని విశ్వసిస్తున్నాను."

ఏప్రిల్ 17 వ తేదీని రాజాజీ జిన్నాకు తిరిగి యీ క్రిందిలేఖను వ్రాశాడు ;

" క్రిందటిసారి నేను మిమ్మల్ని ఢిల్లీలో కలుసుకున్నప్పుడు లిఖితపూర్వ కంగా మీకందజేసిన ప్రణాళికను మీరు తిరిగి చదివి, ఆలోచించియుంటారని భావి స్తున్నాను. ఆ సూచనలను మీరు అంగీకరింపజాలనందుకు నాకు ఆశాభంగం కలి గింది. అయినా మీరు వాటినిగురించి మరొకసారి ఆలోచిస్తారని నమ్ముతున్నాను. పరిష్కారానికవి న్యాయమైన, సంతృప్తికరమైన, పునాది అని నేను హృదయ పూర్వకంగా విశ్వసిస్తున్నాను. వాటినిగురించి మీరు తిరిగి ఆలోచించారో; లేదో తెలుసుకొనగోరుతున్నాను."

దీనికికూడా జిన్నాగారినుండి జవాబు రాలేదు. మహాత్ముడు మే నెల 6 వ తేదీని విడుదలచేయబడ్డాడు. ఐక్యతకు చక్కని అవకాశం లభించింది. ఉభయ

పార్టీల నాయకులు సంప్రతింపులు జరపడానికి యిక యెవరూ ఆటంకం పెట్ట జాలరు. ఈ అనుకూల పరిస్థితులు చూచి రాజాజీ జిన్నాకు జూన్ 30 వ తేదీని యీ విధంగా టెలిగ్రాం యిచ్చాడు :

"నా రెండు జాబులకు మీరు జవాబీయలేదు. నేను గాంధీజీని కలుసుకొని మాట్లాడాను. పై ప్రణాళికకు ఆయన యిప్పటికి తన అంగీకారాన్ని తెలియజేస్తు న్నారు. ఆ ప్రణాళికను, మీ నిరాకరణను, పత్రికలలో ప్రకటించడం నా కోరిక. గాంధీజీ అంగీకారంతోనే నే నీ టెలిగ్రాం పంపుతున్నాను. నేటి క్లిష్టపరిస్థితులలో మీ నిరాకరణనుగురించి తిరిగి ఆలోచించవలసినదిగా కోరుతున్నాను."

## జి న్నా జ వా బు

దీనికి జిన్నాగారు యీ నెల 2 వ తేదీన క్రిందివిధంగా జవాబు పంపించారు;

"ప్రణాళికను ప్రకటించే విషయంలో మీ అభిప్రాయాన్ని చూచాను. మీ ప్రణాళికను నేను నిరాకరించినట్లు తెలియజేయడం న్యాయంకాదు. అదిచూచి నేను ఆశ్చర్యపోయాను. యదార్థ పరిస్థితులు ఏమంటే; ప్రణాళికలో ఎట్టి మార్పు లకు అవకాశంలేదని మీరు చెప్పారు. అయినప్పటికీ నేను దానిని ముస్లింలీగు వర్కింగు కమిటీయెదుట పెడతానని చెప్పాను. అందుకు మీరంగీకరించలేదు. కనుక తదుపరి యెట్టి చర్య తీసుకోలేకపోయాను. నా అభిప్రాయం యేమంటే, దాన్ని అంగీకరించడంగాని, నిరాకరించడంగాని నా చేతులోలేదు. ఇప్పుడుకూడ నేను అదే అభిప్రాయాన్ని కలిగియున్నాను. ఇప్పుడైనా గాంధీజీ తన ప్రణాళి కను నాకు సరాసరి పంపించినట్లయితే; ముస్లింలీగ్ వర్కింగ్‌కమిటీ యెదుట పెట్టడానికి సిద్ధంగానే వున్నాను.",

దీనికి రాజాజీ యీ నెల 4 వ తేదీని క్రిందివిధంగా జిన్నాకు టెలిగ్రాంయిచ్చాడు :

"మీరిచ్చిన టెలిగ్రాంకు ధన్యవాదాలు. పైప్రణాళికను మీరు వ్యక్తిగతంగా నిరాకరించినట్లు నేనెందుకు అభిప్రాయ పడవలసివచ్చిందో నేను ఏప్రిల్ 17 వ తేదీని వ్రాసిన జాబులో తెలియజేశాను. కాని యిప్పుడు మీరు దానిని నిరాకరించి నట్లుగా తెల్పుతూన్నందుకు సంతోషిస్తున్నాను. ఈ విషయంలో గాంధీజీకి ఎవరూ యెట్టి అధికారాన్ని యివ్వకపోయినా, నా ప్రణాళికను ఆమోదించారు. ఆ ప్రధాన సూత్రాలపై మీతో రాయబారాలు నడపడానికి ఆయన నన్ను నియమించారు. ఇప్పుడు తిరిగి తమఆమోదాన్ని తెలియజేస్తున్నారు. నా ప్రణాళికను మీరంగీకరిస్తే గాంధీజీయొక్క అభిప్రాయంతో కాంగ్రెసు ముస్లాతికపాత్ను యేకీభవించవచ్చు. కాని, మీరు ప్రణాళికను లీగ్ కౌన్సిల్‌యెదుట పెట్టాలంటున్నారు. అట్టి విధానం

వల్ల ప్రయోజనం ఉండదని నా అభిప్రాయం. ఎందువల్లనంటే, మీరు ప్రణాళికను ఆమోదించడం లేదు."

తరువాత జిన్నాగారు రాజాజీకి యిచ్చిన టెలిగ్రాంలో తాను అంతకంటె యేమీ చేయజాలనని తెలియజేశారు.

ఈ ఉత్తర ప్రత్యుత్తరాల ప్రాధాన్యత యేమంటే, మహాత్ముడు మొట్ట మొదటసారి ముస్లిం ప్రజలకోరే స్వయంనిర్ణయహక్కును, విడిపోయేహక్కుతో సహా స్పష్టంగా అంగీకరిస్తున్నాడు. లీగ్ నాయకత్వంలోకూడా అనేకమంది గాంధీజీ ముస్లింలీగ్‌కోరే స్వయం నిర్ణయ సూత్రాన్ని అంగీకరిస్తే ఐక్యత సులభ సాధ్యమౌతుందని ప్రకటనలు గావిస్తున్నారు. కాబట్టి లీగ్ వర్కింగ్ కమిటీ పై ప్రణాళికను నిరాకరిస్తుందనే అనుమానం ఉండనవసరం లేదు. జిన్నాగారుకూడా వర్కింగు కమిటీయెదుట ప్రణాళికను పెట్టడానికి సిద్ధంగావున్నారు. మహాత్ముడు స్వతస్సిద్ధమైన తన విశాల హృదయంతో జిన్నాగారికి జాబువ్రాసి, సంప్రతింపులను ప్రారంభించడం అవసరం. ప్రధాన విషయంలో ఉభయ నాయకులు యేకీభవిస్తున్నప్పుడు, యెవరు మొదట కదుల్తారా ? అనే చిన్న విషయానికి ప్రాధాన్యత యివ్వరాదు.

# ముస్లింలీగ్ : భారతదేశ స్వాతంత్ర్యము

చాలామంది కాంగ్రెసువాదుల అభిప్రాయమేమంటే, ముస్లింలీగ్‌గాని, లీగ్ నాయకులుగాని, తమ మతంఅంటే మొండి దురభిమానంతప్ప మరొకటేదీ ప్రధానంగా యెంచరు స్వార్థంకొరకు వారు దేశంయొక్క శ్రేయస్సును సహితం మట్టిపాల్జేయడానికి వెనుదీయరు. పాకిస్థాన్ నినాదం ఒక "స్టంటు" తప్ప మరొకటికాదు. దేశంయొక్క ఐక్యతను చీల్చడానికి సామ్రాజ్యవాదులే యీ నినాదాన్ని లేవదీయించారు. మనదేశాన్ని రాజకీయంగాను, ఆర్థికంగాను, బానిసత్వంలో ఉంచడానికి సామ్రాజ్యవాదులుపన్నిన్న పన్నాగం యిది. ముస్లింలీగ్‌పట్ల యిట్టి అభిప్రాయంతోఉన్న కాంగ్రెసువాదులు ఆసంస్థతో ఎట్టి సంబంధమూ పెట్టుకోకూడదని వాదించడంలో ఆశ్చర్యంలేదు.

కాని, ముస్లింలీగ్‌పుట్టిన 37 సంవత్సరాలలోనూ హిందూ-ముస్లిం సంబంధాలేవిధంగా పరిణమించెందుతూ వచ్చాయో పరిశీలించినట్లయితే, ముస్లింప్రజలలో నానాటికి పెరుగుతూవచ్చిన రాజకీయ చైతన్యంయొక్క ప్రతిబింబమే పాకిస్థాన్ అని మనం తెలుసుకోవచ్చు. దేశమంతటా స్వాతంత్ర్యం కొరకు సాగించబడిన జాతీయోద్యమంతో బాటే ముస్లింజాతుల రాజకీయ చైతన్యం కూడా వృద్ధిచెందింది.

## 1906 నాటి దేశ పరిస్థితి

ముస్లింలీగ్ 1906 లో స్థాపించబడింది. అప్పటికి దేశపరిస్థితి యెలాఉండేదో చూదాం. బ్రిటిషు పరిపాలన అన్ని రాష్ట్రాలలోను స్థిరపడింది. కాని, పరిశ్రమలు, వ్యాపారం, విద్య కలకత్తా - బొంబాయి - మద్రాసులలో మాత్రమే యెక్కువగా వ్యాపించాయి. ముస్లిం ప్రజలెక్కువగా నివశించేప్రాంతాలు యింత అభివృద్ధి చెందలేదు. అట్టి రాష్ట్రాలు పంజాబు, తూర్పుబెంగాలు, పశ్చిమోత్తర పరగణాలు, సింధు, బెలూచిస్థాన్‌లు. కొన్ని చారిత్రక కారణాలవల్లకూడా ముస్లింప్రజలు తమ విద్యాభివృద్ధికి ఉన్న అవకాశాలను పూర్తిగా వినియోగించుకోలేకపోయారు. సర్. సయ్యద్ అహమ్మద్‌ఖాన్ అంచనాప్రకారం, 1893 లో దేశం మొత్తంమీద బి. ఏ. ప్యాసైన ముస్లింల సంఖ్య 546; హిందువుల సంఖ్య 4987.

ఆ రోజుల్లో వోటింగుహక్కు కొద్దిమంది ఆస్తిపరులకు మాత్రమే ఉండేది. ఎన్నికలలో అభ్యర్థిగా నిలబడ్డానికి బాగా చదువుకున్న బుద్ధికుశలులకు మాత్రమే అర్హతవుండేది.

## ప్రత్యేక నియోజకవర్గాలు

ఇలాంటి పరిస్థితుల్లో మింటో-మార్లే సంస్కరణ లొచ్చాయి. ముస్లింలకు ప్రత్యేక నియోజకవర్గాలుండాలనీ, (అంటే, ఎన్నికలలో ముస్లిములు ముస్లిము అభ్యర్థులకే వోటుచేయడం) శాసనసభలలో కొన్నిసీట్లు ముస్లిములకు ప్రత్యేకంగా విడిచిపెట్టాలనీ, ముస్లింలీగు కోరింది. ఈవిధంగా మొదట హిందూ-ముస్లిం సమస్య మన దేశంలో కొన్ని చారిత్రక కారణాలవల్లనే బయలుదేరింది: సామ్రాజ్యవాదులచే సృష్టించబడిన సమస్య అనడం సరికాదు. వారు దాన్ని తమ స్వార్థంకొరకు ఉపయోగించుకొంటున్నారనే మాట నిజమే. మనం కూడా మన దేశంయొక్క అభ్యున్నతికి, స్వాతంత్ర్యసంపాదనకు, హిందూ-ముస్లిం సమస్యను పరిష్కరించుకొంటే, సామ్రాజ్యవాదుల్ని దూరంచేసి, బలహీన పరచగలుగుతాం.

1906 నాటి దేశపరిస్థితుల్ని మనం దృష్టిలో వుంచుకున్నట్లయితే, ముస్లింలీగ్ కోరిన కోరిక న్యాయమైనదేనని అర్థం చేసుకోగలుగుతాం. కొత్తగా అభివృద్ధికి వస్తున్న ముస్లిం మధ్యతరగతి విద్యాధికులు ప్రత్యేక నియోజకవర్గాలద్వారా మాత్రమే తమ సోదర ముస్లిముల్ని అభివృద్ధికి తీసుకురావడాని కవకాశం ఉండేది. ముస్లిం ప్రజలశ్రేయస్సుకై పాటుపడ దానికి అప్పట్లో అదే సరియైన ప్రజాస్వామ్యకోరిక. ఆర్థికంగాను, రాజకీయంగాను. వెనుకబడ్డ మన తోడి ముస్లిం దేశీయులు పైకి రావడానికి పడే ఆరాటం, పొందే తహతహ ఆ కోరికద్వారా రూపం దాల్చింది.

## స్వపరిపాలన హక్కు

ముస్లింలీగ్ స్థాపించబడిన 5 సంవత్సరాలకు, అనగా 1912 లో, తన ఆశయాన్ని యీ క్రిందివిధంగా నిర్వచించింది:

"బ్రిటిష్ చక్రవర్తి పరిపాలనక్రింద, దేశాని కనుగుణ్యమైన విధంగా స్వపరిపాలన చేసుకోవడం" ముస్లింలీగ్‌యొక్క ఆశయం. ఈ ఆశయాన్నే 1905 నుండీ కాంగ్రెసు కలిగియుండేది. టర్కీని సామ్రాజ్యవాదులు విచ్ఛిన్నంచేయడం వల్ల, జార్ చక్రవర్తి (రష్యా) పెర్షియామీద దాడి సల్పడంవల్ల, మలయాలో ముస్లింలనుభవించే బాధలనుగూర్చి తెలుసుకోవడంవల్ల, మనముస్లింలలోకూడా సామ్రాజ్య వ్యతిరేక దృక్పథం నాటుకుంది. బాల్కన్ యుద్ధం జరిగేరోజుల్లో డాక్టరు అన్సారీ నాయకత్వాన టర్కీకొక ముస్లిం వైద్యదళాన్ని పంపించారు.

ఈవిధంగా కాంగ్రెసు ఆశయాన్నే ముస్లింలీగుకూడా అంగీకరించడంతో ఈ రెండుసంస్థలమధ్య ఏకీభావం ఏర్పడింది. తరవాత కొన్నాళ్ళకు యుద్ధంవచ్చింది. యుద్ధఘటనలవల్ల ఈ ఐక్యత మరింత హెచ్చింది. రెండుసంస్థల నాయకులూ కలిసి చాలాసార్లు సమావేశమౌతూ వచ్చారు. ఒడంబడికకు 1915 లో సంప్రతింపులు ప్రారంభమయాయి.

## కాంగ్రెసు-లీగు ఒడంబడిక

చివరకు కాంగ్రెసు-ముస్లింలీగులమధ్య 1916 లో ఒడంబడిక జరిగింది. ఇండియా మంత్రిగావున్న మాంటేగూ 1917 లో మనదేశానికి వచ్చినప్పుడు కాంగ్రెసు-ముస్లింలీగు నాయకులు ఐక్యకంఠంతో జాతీయవాంఛను తెలియజేశారు.

ఈ సందర్భంలోనే సిడెన్హాం ప్రభువు, "ప్రమాదకరమైన కుట్ర" ఒకటి జర్మన్ ఏజంట్లద్వారా ఇండియాలో కొనసాగుతూందని దుష్ప్రచార మారంభించాడు.

ఈ ఒడంబడికలో ప్రధానాంశా లేమంటే - ముస్లిములందరికీ ప్రత్యేక నియోజకవర్గాలుండాలి. వివిధరాష్ట్రీయ శాసనసభలలో ఎన్ని ముస్లిం సీట్లుండాలో ముందే నిర్ణయించుకోవాలి; పంజాబులో సగం ఎన్నికస్థానాలు ముస్లింలకు ప్రత్యేకించాలి; బెంగాల్‌లో 100 కి 40 సీట్లు ముస్లిముల కుండాలి. కేంద్రశాసనసభలో మూడో వంతు ఎన్నికస్థానాలు ముస్లిములకీయాలి. ముస్లిములకు సంబంధించిన ఏబిల్లు నయినా ముస్లిం సభ్యులలోఉన్న ముప్పాతికవంతు వ్యతిరేకిస్తే. అది చట్టంగా అమలులోకి రాకూడదు.

ఈ ఒడంబడికవల్ల రెండువిషయాలు మనకు స్పష్టంగా తెలుస్తున్నాయి. మొదటిది : ముస్లిములకు మొట్టమొదటిసారిగా పంజాబు, బెంగాల్ రాష్ట్రాలలో ఒక ప్రధానమైన రాజకీయస్థానం లభించింది. రెండో విషయం : ఫెడరల్ రాజ్యాంగంలో చిన్నజాతులకు పెద్దజాతులతో సమానమైన హోదా యివ్వబడింది. ఎక్కువ బలంఉన్న మెజారిటీజాతులు బలహీనమైన మైనారిటీజాతుల్ని అణచి యుంచకుండా తగినరక్షణ ఉంటుందని స్పష్టమైన గ్యారంటీ వచ్చింది.

# ఖిలాఫత్ సమస్య

ఈ లక్నో ఒడంబడికవల్ల కాంగ్రెసు-ముస్లింలీగుల మధ్య యేర్పడిన ఐక్యత క్రమక్రమంగా వృద్ధిచెందింది. యుద్ధం అయిపోయాక పంజాబులో జరిగిన అత్యాచారాలు, దేశంలో వ్యాపించిన ఆర్థికసంక్షోభం, రష్యావిప్లవంలో ప్రజలుపొందిన విజయం, టర్కీ సామ్రాజ్యాన్ని యితర సామ్రాజ్యవాదులు తమలోతాము పంచుకోవడం - యివన్నీ మనదేశ ప్రజలలో విపరీతమైన సంచలనాన్ని కలుగజేశాయి. బ్రహ్మాండమైన ప్రజాఉద్యమం బయల్దేరింది. దాన్ని గాంధీజీ, మోతీలాల్‌నెహ్రూ, సి. ఆర్. దాస్. వంటి కాంగ్రెసు నాయకులు; మహమ్మదాలీ, షౌకతాలీ, అబ్దుల్ కలాం ఆజాదువంటి ముస్లింలీగ్ నాయకులు నడిపించారు.

ఈ ఉద్యమంలో ప్రధానమైన నినాదాలు మూడు: దేశానికి స్వరాజ్యం; రౌలట్‌చట్టాన్ని రద్దుచేయడం; ఖిలాఫత్. ఖిలాఫత్ అంటే, టర్కీ, సిరియా, ఇరాక్, పెర్షియా, అరేబియా వంటి ముస్లిం దేశాలన్నింటికీ సంపూర్ణ స్వాతంత్ర్యం.

పైమూడు నినాదాలపై కాంగ్రెసు సమావేశాలు, ఖిలాఫత్ సమావేశాలు, తరచు కలిసే జరుగుతూండేవి. కాంగ్రెసు నాయకులు, లీగ్‌నాయకులు, ఓకేవేదికపై ఉపన్యసించేవారు. సహాయ నిరాకరణోద్యమంలో వేలకొద్దీ హిందువులు - ముస్లింలు కలసి పాల్గొన్నారు. ఈ ఉద్యమాన్ని కాంగ్రెసు - ముస్లింలీగ్ - ఖిలాఫత్ కాన్ఫరెన్సులు మూడూకలసి ప్రారంభించాయి; కలిసి నడిపించాయి.

ముస్లిం ప్రజాసామాన్యం ఈవిధంగా ఎందుకు పోరాటంలో పాల్గొన్నారు? వారి వాంఛలు, కోర్కెలు ఏమిటి? మొదటికారణం: మన దేశంనుండి సామ్రాజ్యవాదాన్ని సాగనంపడంకోసం. రెండోది, ముస్లింప్రజ లందరి స్వాతంత్ర్యంకోసం. వారికోరిక అప్పట్లో అస్పష్టంగానే ఉన్నప్పటికీ, ముస్లింజాతుల - మనదేశంలో ఉన్న ముస్లిం జాతులతోకూడా - స్వాతంత్ర్య సంపాదనకై వారు తహతహలాడారనే విషయం స్పష్టంగా బోధపడుతుంది.

ఈ విషయాన్ని అప్పట్లో గాంధీజీ, కాంగ్రెసు నాయకులు చక్కగా గుర్తించడంవల్లనే, ఖిలాఫత్ సమస్యను కాంగ్రెసు కార్యక్రమంలో చేర్చడంవల్లనే, సంపూర్ణమైన హిందూ-ముస్లిం ఐక్యతసమకూరింది. అందుకే సామ్రాజ్యవాదం గజగజలాడిందికూడా।

## సైమన్ కమిషన్

కాని సహాయ నిరాకరణోద్యమం విఫలమయాక. ఈరెండు సంస్థలలోను చీలికలు, అనైక్యత వ్యాపించాయి. 1927 లో బ్రిటిష్‌ప్రభుత్వం సైమన్ కమిషన్‌ని నియమించిన వార్త చేరగానే. దేశంఅంతటా మళ్ళీ క్రోధాగ్ని మిన్నుముట్టింది. కాంగ్రెసు, ముస్లింలీగ్‌లు రెండూ సైమన్ కమిషన్ నియామకాన్ని ఖండించాయి. ఐక్యతతో ప్రభుత్వ పన్నాగాన్ని యెదుర్కోడానికి మళ్లీ సంప్రతింపులు ప్రారంభ మయాయి. ముస్లింలీగ్ తరపున జిన్నా 14 అంశాలుగల ఒక ప్రణాళికను ముందు పెట్టాడు. దాన్ని ముస్లింలీగే కాకుండా ముస్లిం కాన్ఫరెన్సు, మౌలానా మహమ్మ దాలీ నాయకత్వంక్రింద ఉన్న ఖిలాఫత్ ముస్లింలు. జమియత్ ఉల్ ఉలేమాలు బలపరిచారు. డాక్టరు అన్సారీ; అబుల్‌కలాం అజాద్ మొదలైనవారు తప్ప మిగతా ముస్లిం రాజకీయ ప్రముఖులందరూ జిన్నా ప్రణాళికను అంగీకరించారు. కాంగ్రెసు తరపున నెహ్రూ రిపోర్టు తయారుచేయబడింది.

## నెహ్రూ రిపోర్టు

ముస్లింలీగ్ ప్రణాళికకు, నెహ్రూరిపోర్టుకు మధ్య ఏయే విషయాలలో భేదం వచ్చింది? 1928లో జరిగిన అఖిలపక్షసమావేశంలో ఏకీభావం ఎందుకు కుదరలేదు?

దేశంలో ఏర్పడనున్న ఫెడరల్ రాజ్యాంగంలో రెసిడ్యుయరీ అధికారాలన్నీ కేంద్రప్రభుత్వానికే ఉండాలని నెహ్రూరిపోర్టు సిఫార్సుచేసింది. (రెసిడ్యుయరీ అధి కారాలంటే. కేంద్రప్రభుత్వానికీ. రాష్ట్రప్రభుత్వాలకూ నిర్దేశించబడు అధికారాలు తప్ప మిగతావన్నీ) ఇంతేకాదు. ఎన్నికలలో సమిష్టినియోజకవర్గాలుండాలి. (అంటే. ముస్లింలు హిందువులకైనా వోటుచేయవచ్చు. ముస్లింలకైనా వోటు చేయవచ్చు. ముస్లింలకే వోటుచేయాలని నిబంధన ఉండకూడదు) ముస్లింలు మైనారిటీగా ఉండే రాష్ట్రాలలో మాత్రం వారికి కొన్నిసీట్లు రిజర్వుచేయబడతాయి. కేంద్రశాసనసభలో మాత్రం అలా రిజర్వుచేయబడవు. అంటే కేంద్రంలో నాలుగో వంతు మాత్రమే ముస్లింలు ఉంటారన్నమాట.

ఇక, ముస్లింలీగ్ కోరిన ప్రధాన కోర్కెలేమంటే. రెసిడ్యుయరీ అధికారా లన్నీ రాష్ట్రాలకు విడిచిపెట్టాలి. సింధు, బెలూచిస్థాన్ సరిహద్దులు - ప్రత్యేక రాష్ట్రాలుగా యేర్పడాలి. పంజాబు. బెంగాల్ రాష్ట్రాలలో ఇప్పుడున్న ముస్లిం మెజా రిటీలను అలాగే ఉంచాలి. ముస్లింలకు ప్రత్యేక నియోజకవర్గాలుండాలి. వారి మతానికీ, విజ్ఞానానికీ, రక్షణలుండాలి. కేంద్రశాసనసభలో ముస్లింసీట్లు మూడో వంతుకు తక్కువ ఉండకూడదు.

## స్వయంనిర్ణయహక్కు

ఈ కోర్కెల సారాంశంఏమిటి? స్వరాజ్యం వచ్చాక, మనదేశంలో ఎలాంటి రాజ్యాంగం ఉంటుందో నిర్ణయించడానికి ప్రజాప్రతినిధులు సమావేశమై యున్నప్పుడు ముస్లింప్రజ ముందుకొచ్చి తమ కెలాంటి హక్కులుంటాయని అడుగుతున్నారు. సంపూర్ణస్వాతంత్ర్యం లభించిన తరువాత ముస్లిం ప్రజలకు యితర జాతులతోబాటు ప్రజాస్వామ్యసూత్రాలపై ఆధారపడే స్వాతంత్ర్యం ఉంటుందా అని ప్రశ్నిస్తున్నారు. వారి హక్కులకై ప్రత్యేకరక్షణ లీయవలసిందని కోరుతున్నారు. బలీయంగా ఉన్న ఇతరజాతులు తమను అణచిపెట్టి యుంచకుండా గ్యారంటీనిమ్మని అడుగుతున్నారు. తాముకూడా అన్ని విషయాలలోను అభివృద్ధి పొందడానికి సమాన అవకాశాలు కావాలంటున్నారు.

ఈ కోర్కెలలో అన్యాయమైనవేమిటి? ఇట్టి ప్రజాస్వామ్య స్వాతంత్ర్యం కొరకే గదా కాంగ్రెసు పోరాడింది? ముస్లిం ప్రజలు నేడు ముందుకొచ్చి ప్రజాస్వామ్య హక్కులకై ఆరాటపడటానికి చాలావరకు కారణం కాంగ్రెసు నడిపిన జాతీయోద్యమాలేగదా। సామ్రాజ్య వ్యతిరేక పోరాటాలద్వారా ఆంధ్రులు, మహారాష్ట్రులు, కన్నడులు మొదలైన వారిలో క్రొత్తజాతీయచైతన్యంబయల్దేరినట్లుగానే ముస్లింజాతులలోకూడా వ్యాపించిన జాతీయచైతన్యం, రాజకీయ చైతన్యం యొక్క ప్రతిబింబమేగదా।

కాని, ముస్లిం ప్రజలలో రేకెత్తిన యీ క్రొత్తచైతన్యాన్ని కాంగ్రెసు గుర్తించలేదు. అందువల్ల ఒడంబడిక కుదరలేదు. ఫలితం ఏమయిందంటే, 1930–32 సంవత్సరాలలో జరిగిన శాసనోల్లంఘనోద్యమంలో ముస్లింలు పెద్దపెట్టున పాల్గొనలేదు. లండన్‌లో రౌండ్ టేబిల్ సమావేశం జరిగాక ప్రభుత్వం కమ్యూనల్ ఎవార్డును ప్రవేశపెట్టింది (అంటే ముస్లింలకు ప్రత్యేక నియోజకవర్గాలిచ్చింది) ఐక్యతకు మళ్ళీ ప్రయత్నాలు జరిగినప్పటికీ ఫలించలేదు. 1937 లో క్రొత్తరాజ్యాంగ చట్టం అమల్లోకి వచ్చింది.

## ఎన్నికలు; వాటి పర్యవసానం

దానిప్రకారం దేశమంతటా ఎన్నికలు జరిగాయి. కాంగ్రెసు అభ్యర్థులకు బ్రహ్మాండమైన విజయం లభించింది. వారికి మెజారిటీ వచ్చిన రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రివర్గా లేర్పడ్డాయి. కాని కాంగ్రెసు ఆశించిన దొకటి; జరిగింది మరొకటి. హిందూ - ముస్లిం ఐక్యత రాకపోగా, కాంగ్రెసులోనే ఉన్న ముస్లిం

ప్రజాసామాన్యం క్రమక్రమంగా కాంగ్రెసునుండి దూరమైపోసాగింది. ముస్లింలీగ్ మళ్ళీ బలీయమైన సంస్థగా ఏర్పడింది. అది తన ఆశయాన్ని ఈ క్రింది విధంగా నిర్వచించింది.

"దేశంలో సంపూర్ణ స్వాతంత్ర్యం స్థాపించబడాలి ప్రజాస్వామ్య సూత్రాలపై పరిపాలించబడే రాజ్యాలు అందులో భాగాలుగా వుండాలి. ముసల్మానుల హక్కులు, ప్రయోజనాలు, క్రియారూపంలో తగినంతగా రక్షించబడేటట్లు రాజ్యాంగ చట్టంలో నిబంధనలుండాలి."

అంటే. దేశస్వాతంత్ర్యాన్ని గురించి ఎత్తుకున్నప్పుడల్లా ముస్లింజాతుల స్వాతంత్ర్యంకూడా ప్రధానవిషయమేనని లీగ్ కోరుతూవచ్చిందన్నమాట. దేశంలో ముందు ముందు యేర్పడబోయే ఫెడరల్ రాజ్యాంగంలో "ప్రజాస్వామ్య సూత్రాల ప్రకారం పరిపాలించబడే రాజ్యాలు" భాగాలుగా ఉండాలని లీగ్ కోరుతోందన్న మాట.

కాంగ్రెసు మంత్రివర్గాలు అధికారంలో ఉన్నంతకాలం హిందూ - ముస్లిం సమస్య పరిష్కరించబడకపోగా, మరింత పాడుస్థితికి వచ్చింది. 1939 లో యుద్ధం ప్రకటించబడి, కాంగ్రెసుమంత్రులు రాజీనామాలు యివ్వగానే "అబ్బ! పీడ వదలిపోయిందిరా!" అనేటట్లు దేశం అంతటా "విముక్తి దినోత్సవాలు" ముస్లింలు జరిపారు.

యుద్ధం రాగానే, దేశంయొక్క సంపూర్ణ స్వాతంత్ర్య సంపాదన జాతీయ వాదులందరికీ తక్షణసమస్య అయింది.

## పాకిస్థాన్ తీర్మానం

కాని, కాంగ్రెసు - ముస్లింలీగుల మధ్య 1916 లో వలె ఐక్యత రానేలేదు. కాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్యం, ప్రజాప్రతినిధి పరిషత్తు (అంటే, ఎలాంటి రాజ్యాంగం ఉండాలో నిర్ణయించేది, ప్రజలచే ఎన్నుకొనబడు ప్రతినిధులసభ). కావాలని కోరితే, ముస్లింలీగ్ 1940 లో పాకిస్థాన్ తీర్మానాన్ని ప్యాసుచేసింది. ఆ తీర్మానం ప్రకారం ముస్లింలు మెజారిటీలో ఉన్న ఏరియాలలో ముస్లింలకు స్వయం నిర్ణయ హక్కు, సర్వాధికారం ఉండాలి. కొంతకాలం అయాక దేశానికి జపాన్ దాడి ప్రమాదంకూడ యేర్పడింది. ప్రధానసంస్థలైన రెండింటిమధ్య ఐక్యత మరింత అవసరమయింది. కాని, ఐక్యత కుదరలేదు. క్రిప్సు ప్రతిపాదనలు వచ్చాకకూడా ఒడంబడిక జరగలేదు. ఫలితం ఏమైందో అందరికీ తెలుసు. బ్రిటిష్ అభివృద్ధినిరోధకులు మన ప్రతినిధులకు అధికార మీయకుండా, మొండి చెయ్యిచూపెట్టారు.

అప్పటినుంచీ పరిస్థితులు మరింత అధ్వాన్నమయాయి. దేశంలో కరువు, అంటువ్యాధులు, వ్యాపించాయి. ఒకటి తరువాత మరొకటిగా విపత్తులు ప్రజలందరి మీద విరుచుకుపడ్డాయి. కాని, అనైక్యతవల్ల కాంగ్రెసుగాని ముస్లింలీగ్‌గాని, యీ ఆపత్కాలంలో ప్రజలకు సేవచేయలేకపోతూన్నాయి.

## స్వాతంత్ర్యసాధనకు మార్గం

అయితే, ఈ ఊబినుండి బయటపడే మార్గంఏమిటి? మన ప్రధాన జాతీయ సంస్థలు రెండూ ఐక్యకంఠంతో జాతీయవాంఛను ప్రకటించడం ఎలాగు ?

పై విషయాల్నిబట్టి, ముస్లిం లీగు నేటివరకూ కోరుతూవచ్చిన హక్కులు, రక్షణలు, సామ్రాజ్యవాదులచే ప్రోత్సహించబడ్డవికావని స్పష్టంగా తెలుసుకోవచ్చు. మనదేశంలో క్రమక్రమంగా అభివృద్ధిచెందుతూన్న ముస్లింప్రజల జాతీయ చైతన్యానికవి చిహ్నాలు. ప్రజాస్వామ్య సూత్రాలపట్ల వారికిగల అభిమానానికవి ప్రతిబింబాలు. వారి సామ్రాజ్య వ్యతిరేక దృక్పధానికి ప్రతిధ్వనులు. సంపూర్ణ స్వాతంత్ర్యంకొరకు దేశంలో వ్యాపిస్తూవచ్చిన జాతీయోద్యమంయొక్క ఫలితాలే ఈకోర్కెలు. జాతీయోద్యమాన్ని అవి ఏమాత్రం ఆటంకపరచవు; పైగా బలపరుస్తాయి. కాబట్టి, యీరోజున కాంగ్రెసు-ముస్లింలీగులు ప్రధానవిషయాలలో ఎంతో దగ్గర సంబంధం కలిగియున్నాయి.

సంపూర్ణ స్వాతంత్ర్యమే రెండు సంస్థలకూ గమ్యస్థానం. స్వయంనిర్ణయ సూత్రాన్ని రెండుసంస్థలూ అంగీకరిస్తున్నాయి. వివిధజాతులుకోరే వాంఛలను, ఆశయాలను రెండుసంస్థలూ ప్రతిబింబిస్తున్నాయి.

ఈదృష్టితో కాంగ్రెసువాదులు పాకిస్థాన్ నినాదాన్ని చూచినట్లయితే, ముస్లింలీగ్‌కూడా ప్రజాస్వామ్యసూత్రాల కనుగుణ్యమైన కార్యక్రమాన్నియిస్తూ లీగ్ మంత్రివర్గాలద్వారా ప్రజల నిత్యజీవిత సమస్యల్ని పరిష్కరించినట్లయితే — యీ రెండు సంస్థలమధ్య తప్పనిసరిగా ఐక్యత ఏర్పడుతుంది. అట్టి ఆశయసిద్ధికై ప్రతి భారతదేశభక్తుడు తన యావచ్ఛక్తినీ వినియోగించాలి. సుప్రసిద్ధ ఉర్దూకవి డాక్టర్ ఇక్బాల్ 1932 లో జరిగిన ముస్లింలీగు సమావేశానికి అధ్యక్షతవహిస్తూ చెప్పిన మాటలు యివి :

"ముస్లిం జన్మభూములలో ముస్లిముల విజ్ఞానం, సాంప్రదాయాలు, స్వేచ్ఛతో అభివృద్ధి పొందడానికి హక్కును కలిగియున్నారనే సూత్రం అంగీకరించబడితే, హిందూ-ముస్లిం సమస్య శాశ్వతంగా పరిష్కరించవచ్చు. అప్పుడు భారతదేశంయొక్క స్వాతంత్ర్యసిద్ధికి ప్రతి ముస్లింకూడా తన సర్వస్వాన్ని త్యజించడానికి సిద్ధంగా ఉంటాడు."

# న్యాయమైన కోర్కె

1940 మార్చి 26 వ తేదీని లాహోర్ సమావేశంలో అఖిలభారతముస్లిం లీగ్ పాకిస్థాన్ తీర్మానాన్ని చేసింది. ప్రఖ్యాతిగాంచిన ఖిలాఫత్ ఉద్యమం తరువాత, భారతముస్లిములు, తమకు సంపూర్ణ రాజ్యాధికారంతో గూడిన స్వాతంత్ర్యం కావాలని, బ్రిటిషు సామ్రాజ్యవాదంనుండి పూర్తిగా విముక్తి పొందడానికి తమ యిష్టం వచ్చిన విధానంలో తమ జాతి జీవితాన్ని నిర్మించుకోవాలని బహిరంగంగా, స్పష్టంగా ప్రకటించడం ఇదే మొదటిసారి.

అయినప్పటికీ మామూలు కాంగ్రెసు దేశభక్తుల దృష్టిలో ఈ పాకిస్థాన్ కోర్కె అంటే ముస్లిములు తమకు కావలసిన సదుపాయాలు పొందడానికి "రియాక్షనరీ" ముస్లింనాయకులు, వేసే ఎత్తుగా కనబడుతోంది. అంతేకాదు, కొందరిదృష్టిలో ఇది సామ్రాజ్యవాదులు మన దేశాన్ని చీల్చి బలహీన పర్చి తమ అధికారాన్ని నిలబెట్టుకోడానికి వారికి దోహదమిచ్చేప్లాను లాగకూడా కనబడుతోంది. అందువల్ల వారు పాకిస్థాన్ కోర్కె అంటే అటువైపుకే చూస్తరు. అయితే వారొక ముఖ్యమైన విషయాన్ని మరచిపోతున్నారు. భారత స్వాతంత్ర్యం అంటే తమ హృదయాలలో ఎంత తహతహవుందో అదేవిధంగా పాకిస్థాన్ కోర్కెకూడ అనేక వేలమంది సోదరముస్లిములలో ఉత్సాహాన్ని రేకెత్తిస్తోందని వారుగుర్తించడంలేదు.

పాకిస్థాన్ కోర్కెపట్ల ఈ దృక్పథం ఎంతవరకు సరియైనదో తెలుసుకోడానికి లాహోర్ తీర్మానాన్నే తీసుకుని చూద్దాం. ఆ తీర్మానంలో ఇలావుంది.

"ఈ క్రింది ప్రధాన సూత్రాలపై నిర్ణయించబడిన రాజ్యాంగ విధానం అయితే తప్ప ఈ దేశంలో ఆచరణయోగ్యంకాదు. ఆ సూత్రాలు ఏవంటే భౌగోళికంగా ఒకదానినొకటి అనుకొనియున్న దేశాలను కలిపి ఒక రీజియన్ (పెద్ద భూభాగంగా) ఏర్పాటుచేయాలి. ఇందుకు అవసరమైతే ఇదివరకున్న సరిహద్దులను మార్చి కొత్త హద్దులను ఏర్పాటుచేయడానికి అవకాశం ఇవ్వాలి. మనదేశంలో ముస్లిములు అధికసంఖ్యాకులుగానున్న తూర్పు, వాయవ్య ప్రాంతాలు అన్నీకలిపి ఒక "స్వతంత్రరాష్ట్రం"గా ఏర్పాటుచేయాలి. ఈ స్వతంత్రరాష్ట్రంలో వుండే యూనిట్లు (చిన్న భూభాగాలు) స్వపరిపాలనాధికారంగల స్వతంత్ర యూనిట్లుగావుండాలి" లేదా జిన్నా మాటలలో చెప్పాలంటే.

"తూర్పు వాయవ్యప్రాంతాలలో డిఫెన్సు, విదేశవ్యవహారాలు, రాకపోక మార్గాలు, కస్టమ్సు, కర్రెన్సీ, మారకం మొదలైన వాటిపై సంపూర్ణాధికారం గల్గిన స్వతంత్ర రాజ్యాలు ఏర్పాటు చేయాలని మేము కోరుతాము" (మద్రాసు ఉపన్యాసం 1941.)

ఈ కోర్కెలో మనం మొట్టమొదట చూడవలసింది ఇది సామ్రాజ్యవ్యతిరేక మైనది అవునా కాదా? అని. కాంగ్రెసు కోరుచున్నట్లే, ముస్లింలీగుకూడా బ్రిటిషు సామ్రాజ్యవాద పరిపాలననుండి సంపూర్ణ స్వాతంత్ర్యం పొందడమే తన ఆశయంగా ప్రకటించుతోందనేది స్పష్టంగానేవుంది. అదీ గాకుండా ఈ మధ్య లీగు నాయకుల ఉపన్యాసాలుకూడా, పాకిస్తాన్‌లో వారు వూహించే స్వాతంత్ర్యం, బ్రిటిషు సామ్రాజ్యవాదులనుండి గుంజుకోవలసినదే అనే విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి. ఢిల్లీ, కరాచీలలో జరిగిన లీగ్ మహాసభలలో వారి నాయకుల ఉపన్యాసాలు ఈ ధోరణినే తెలియచేస్తున్నాయి. భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం లేనిదె తమకుకూడా స్వయం నిర్ణయరాజ్యాధికారం లేదని వారు గుర్తించారు.

దీనికి నిదర్శనం కావాలంటే 1940 మే నెలలో జిన్నా ఏమన్నాడోచూడండి:

"ముందు భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం రావాలి. అనేదానిమీదనే మా ఆశయాలు ఆధారప వున్నాయి. లీగు తీర్మానంలోవున్న ప్రధాన సూత్రాలను అంగీకరించడంద్వారా భారతస్వాతంత్ర్యం మరింత త్వరగా లభించుతుందని మా విశ్వాసం. ఇంకో మార్గంలేదు"

కొందరు కాంగ్రెసువాదులు అసలు పాకిస్తాన్ లీగు ముస్లిముల సహజమైన కోర్కె కానేకాదంటారు. వారు సరిహద్దురాష్ట్రాన్ని చూపి, అక్కడ కాంగ్రెసు పలుకుబడిలోవున్న పఠానులెవరూ పాకిస్థాన్ కావాలని కోరడం లేదంటారు. నిజానికిది సరియైన పరిస్థితి కానేకాదు.

సరిహద్దురాష్ట్రంలో అబ్దుల్ గఫర్‌ఖాన్, అబ్దుల్ ఖయామ్ (ఎమ్.ఎల్.ఎ.) మొదలైన ప్రముఖ కాంగ్రెసునాయకులు, స్వయంనిర్ణయ సూత్రాన్ని అంగీకరించాలనికోరుతారు. వారు తమ ఉపన్యాసాలలో ఈవిషయాన్నే వక్కాణించుతున్నారు. 1942 అగస్టు అఖిలభారత కాంగ్రెసుకమిటీ సమావేశానికి ముందు జరిగిన సరిహద్దురాష్ట్ర కాంగ్రెసుకమిటీ సమావేశంలో స్వయంనిర్ణయ సూత్రాన్ని అంగీకరించాలంటూ తీర్మానించిందికూడాను. అంతేగాకుండా ముఖ్యంగా ఈ పాకిస్థాన్ నినాదం వల్లనే ముస్లింలీగ్ సరిహద్దురాష్ట్రంలో ఎక్కువ పలుకుబడిని సంపాదించింది.

ఇక ఇతరరాష్ట్రాల విషయం చూచినప్పటికీకూడా మెజారిటీగావున్నా, మైనారిటీగావున్నా, ముస్లింలలో అత్యధిక సంఖ్యాకులు ముస్లింలీగ్‌నే అనుసరిస్తారనేది

విజం. కాంగ్రెసుపలుకుబడిక్రింద వున్న వారికి స్వరాజ్యం అంటే ఎంత ప్రియమైన విషయమో ముస్లిములకు పాకిస్థాన్‌అంటే కూడా అంతే ప్రియమైన విషయం.

ముస్లిముల న్యాయమైన హక్కులను ఇవ్వాలని అంగీకరించే కాంగ్రెసు వాదులుకూడ, పాకిస్థాన్ మనదేశానికి నష్టదాయకమని భావిస్తారు. వారికిది దేశాన్ని విభజించడంలాగ కనిపిస్తోంది దీనివల్ల దేశం ముక్కలుముక్కలుగా విడిపోయి, బలహీనపడిపోతుందని వారిభయం. అలాగైతే ఇంక వారు మనదేశంయొక్క ఐక్యతను బలాన్ని ఎలాకాపాడాలని అంటారు? దగ్గరదగ్గరగా కలిసియున్న ప్రాంతాలలో అధికసంఖ్యాకులుగా వుంటున్న ముస్లిములకు, వారిభవిష్యత్తును, వారి భాగ్యోదయాన్ని నిర్ణయించుకొనే హక్కునే అంగీకరించకుండా ఎలా వుండగలరు? స్వతంత్ర భారత దేశంలో, సరిహద్దు రాష్ట్రపఠానులనుగాని, బెలూచీలనుగాని, సింధీయులనుగాని, పంజాబ్ ముస్లిములనుగాని వారికి ఇష్టంలేకుండా బలవంతాన కలసివుండేటట్లు చేయడం సాధ్యమౌతుందని ఎలా అనుకోడం? దీనికి కాంగ్రెసు వాదులు స్పష్టమైన సమాధానం ఇవ్వాలి.

స్వతంత్ర భారతదేశానికి రాజ్యాంగ విధానాన్ని నిర్ణయించే కాన్‌స్టిట్యుయంటు ఎసెంబ్లీ, పంజాబు,సింధు, సరిహద్దురాష్ట్రం, బెలూచిస్థాన్ మొదలైన, ప్రదేశాలను, అక్కడనివసించే ప్రజల కోర్కెలకు వ్యతిరేకంగా, అలాగే వుంచుతామని ఎలా ప్రకటించగల్గుతుంది? అది అసంభవం. అట్టి భారతదేశం ఒక స్వతంత్రదేశంగాను, ఐక్యదేశంగాను నిలబడగల్గుతుందనుకోడం భ్రమ. అలా వుండాలని ప్రయత్నించేయడమంటే, ఈనాడు మన ప్రపంచంలో చూచే అనర్థాలన్నీ అంటే బలహీన జాతులపై బలమైనజాతులు పెత్తనం చలాయించడం, దోపిడి, బానిసత్వం, స్పర్థలు అన్నీ వుండాలనడమే అవుతుంది.

ఈరకమైన ఐక్యతకావాలనడం ప్రధానమైన జాతుల స్వయంనిర్ణయ హక్కును తిరస్కరించడమే అవుతుంది. స్వాతంత్ర్యం కావాలనే ఏ భారతదేశ భక్తుడూకూడా ఈరకమైన ఐక్యతను అంగీకరించ జాలడు. స్వాతంత్ర్యాభిలాషియైన ఏ భారతీయుడుకూడా జాతులకు, సంపూర్ణ రాజ్యాంగాధికారాన్ని పొందేహక్కును, ఒకేచోట నివసించే జాతులు ఒక ప్రత్యేక స్వతంత్రరాష్ట్రంగా ఏర్పడేహక్కును నిరాకరించలేడు.

పాకిస్థాన్ తీర్మానంలో కోరినది ఈ స్వతంత్రరాష్ట్రంగా వుండే హక్కును గుర్తించాలనేతప్ప, మరోటికాదు. అందుచేత ఈ కోరిక 1929 లో లాహోరు కాంగ్రెసులో అంగీకరింపబడి అప్పటినుంచీ ప్రతి సంవత్సరం భారత ప్రజలందరిచేత పునరుద్ఘాటింపబడుతూ వస్తూన్న

స్వాతంత్ర్య తీర్మానంలో ప్రధాన సూత్రాలను ముందుకుతీసుకు పోవడమే అవుతుంది. ప్రజాస్వామ్య సిద్ధాంతంపై మననమ్మకానికి మన జాతీయ కోర్కెకు ఇదే ప్రధాన ప్రాతిపదిక. దీనిని నిరాకరించడమంటే అసలు స్వయంనిర్ణయ సూత్రాన్నే అంగీకరించకపోవడం అన్నమాట.

ఒకే సమిష్టి రాజ్యాంగవిధానంలో రాష్ట్రాలకు విడిపోయేహక్కును, ప్రత్యేక రాష్ట్రంగావుండే హక్కును గ్యారంటీ చేయడం ఒక్కటే ఐక్యత నిర్మించడానికి మార్గం. ఈ ఐక్యత అన్నిజాతులకు సమిష్టిప్రయోజనాలకోసం, పరస్పరసమానత్వంమీద ఆధారపడివుంది. ఈ ఐక్యత సుస్థిరంగావుంటుంది. ఎందుకంటే ఇక్కడ ఒక జాతిపై మరొకజాతి పెత్తనం చెలాయించడం వుండదు. ఐక్యత, స్వతంత్ర జాతుల ప్రజలు సమత్వభావంతో పరస్పరం గావించుకునే సహాయంతో గూడినదిగా వుంటుంది.

సోవియట్ యూనియన్‌నుండి మనం నేర్చుకునే గుణపాఠం ఇదే. అక్కడ సోషలిజం స్థాపించబడటంతో మానవుని మానవుడు, ఒక జాతిని మరోజాతి పీడించుకు తినడం నిర్మూలంగావించబడ్డాయి. దానితోపాటు ఇప్పుడు సోవియట్ యూనియన్‌లో వున్న 15 కాన్‌స్టిట్యుయంటు రిపబ్లిక్కులకు మధ్యనున్న అభేద్యమైన ఐక్యతకు కారణం ఈ రిపబ్లిక్కులకు విడిపోయేహక్కుకూడ గుర్తించడమే. ప్రతి రిపబ్లిక్కు తన సైన్యాన్ని, ప్రత్యేకంగా వుంచుకోడానికి, తన విదేశవ్యవహారాలను తానే చూచుకోడానికి స్వాతంత్ర్యం వున్నదీ అంటే అది విభాగాలుగాఅయిపోయి బలహీనపడటంకాదు దీనివలన సోవియట్‌లోని స్వతంత్రజాతుల మధ్య ఐక్యత మరింత బలపడింది.

ఈ ఐక్యతను, కలయికను, మన ముస్లింలీగ్ యావత్తూ కొనియాడింది. ముస్లిములు పాకిస్థాన్‌వస్తే భారతదేశ రక్షణ విషయంలో బాధ్యతవహించరు అనే అపనిందను ఖండిస్తూ జిన్నా యిలా అన్నాడు :

"మనం చక్కని ఇరుగు పొరుగు వారిలాగ బ్రతుకుదాం. మనదేశాన్ని దక్షిణపువైపున, పడమటివైపున హిందువులు కాపాడాలి. తూర్పు, వాయువ్య సరిహద్దులను ముస్లిములు కాపాడాలి. అప్పుడు మనం ఐక్యతతో విలబడి భారతదేశం భారతీయులదే" అని ప్రపంచానికి చాటుదాం." (అలిఘర్ మార్చి 1941).

వచ్చిన ఖర్మం ఏమంటే విడిపోయే హక్కుపేరుచెప్పేసరికల్లా కొంతమంది దృష్టిలో అస్తమానం కొట్టుకుచచ్చే బాల్కన్ జాతులు ముందు కనబడుతున్నాయి. అయితే ఈ భయానికి వెనుకవున్న దేమిటి? భారతదేశాన్ని బలవంతాన తప్పితే మరోవిధంగా ఒకటిగా వుంచలేము, అనే సామ్రాజ్యవాదుల తత్వమే. ఎందువల్ల

వారికిలాగవుండాలి ? ప్రజాస్వామ్య సూత్రాన్ని అమలుజరపడమంటే వివిధప్రజల మధ్య సమానభావం, పరస్పరం అర్థంచేసుకొని తద్వారా కలయిక, ఐకమత్యం ఏర్పడడం అనేవి జరగాలి.

భారతజాతీయ కాంగ్రెసు తాను అవలంబించుతూన్న ప్రజాస్వామ్య సూత్రాన్ని అనుసరించే రోజురోజుకు లీగు కోర్కెను అంగీకరించేదానికి మొగ్గుతూ వుంది. క్రిప్సు రాయబారాల అనంతరం కాంగ్రెసు వర్కింగుకమిటీ ఇలాఅని ప్రకటన చేసింది. స్వతంత్ర భారతదేశంలో ఏర్పడే యూనియన్‌లో ఏరాజ్యాంగ భూభాగాన్ని బలవంతంగా యూనియన్‌లో వుంచాలనే దృష్టితో కాంగ్రెసు ఆలోచించదు. ఈ ప్రకటనచూస్తే కాంగ్రెసు-లీగులు ఒకదానికొకటి చాల దగ్గరకు వస్తున్నాయనే బోధపడుతుంది.

అల్లాహాబాద్, అఖిలభారత కాంగ్రెసుకమిటీ సమావేశంలో అంగీకరింపబడిన జగత్ నారాయణలాల్ తీర్మానం అనాలోచితంగాను, తొందరపాటుతోను, గావించినది. కాంగ్రెసు వారిలో చాలమంది, కాంగ్రెసునాయకులుకూడా దానిని అలాగేభావించారు. మౌలానా అబ్దుల్ కలాం అజద్, జవహర్‌లాల్‌నెహ్రూ వీరిద్దరూకూడా ఢిల్లీ కాంగ్రెసుతీర్మానం లోని దృక్పథం అలాగే వుందని వక్కాణించుతూ, వ్రాత మూలకంగాకూడా ప్రకటనలు చేశారు.

1942 అగస్టులో జరిగిన బొంబాయి అఖిలభారత కాంగ్రెసుకమిటీ సమావేశంలో, అవశిష్టాధికారాలను (రెసిడ్యుయరీ పవర్సు) రాష్ట్రాలకివ్వాలనే తీర్మానం ద్వారా స్వయంనిర్ణయ హక్కును, అంగీకరించే దానికి ఒకడుగు ముందుకు వేసిందనే చెప్పాలి.

అందుచేత పొరపాటు పంథా నవలంబించే కొందరు కాంగ్రెసువారుగాని, కోపంతో మాట్లాడే కొందరు ముస్లింలీగర్లుగాని ఊహించేటట్లు కాంగ్రెసు అఖండ హిందూస్థాన్ కావాలనే దృక్పథం తీసుకోవడంలేదు. అలా అనుకోడం తప్పు.

కాంగ్రెసు ఇప్పుడు మరొక అడుగు ముందుకువైచి, పాకిస్థాన్ కోర్కెను అంటే, ముస్లింజాతులకు స్వయం నిర్ణయహక్కువుండాలనే సూత్రాన్ని అంగీకరించాలి. అలా చేయకపోవడం అంటే మన స్వాతంత్ర్యోద్యమాన్ని చీల్చడం, మన దేశాన్ని చీల్చడం, కడకి స్వాతంత్ర్యం కావాలనే కోర్కెనే తిరస్కరించడం అవుతుంది.

అంతేకాదు, అలా చేయడమంటే ఈనాడు రాజకీయ ప్రతిష్టంభనను అలాగే వుంచడం అవుతుంది. మనతోడి దేశీయులు కరువుతో, వ్యాధులతో వేలకొలది మృత్యువువాతబడి నశిస్తూవుంటే నిస్సహాయులవలె చూస్తూ కూర్చోవడం అవు

తుంది. నిరంకుశాధికారులకు తమ ఇచ్ఛవచ్చినట్లు పరిపాలన చెలాయించడానికి మరింత అవకాశం ఇవ్వడం అవుతుంది. మనదేశ ఆర్థిక విధానం, సాంఘిక జీవనం కూలిపోతూంటే చూస్తూ వూరుకోడం అవుతుంది. జపాను ముష్కరులకు మనదేశ గుమ్మాలను తెరచివుంచడం అవుతుంది.

ముస్లింలీగుకూడా గత రెండేండ్లలోను మనదేశానికిసంభవించిన దుర్దశనుండి గుణపాఠాన్ని నేర్చుకోవాలి.

నేడు దేశంలో కాంగ్రెసు-లీగు ఐక్యత లేకపోవడంవల్ల, కాంగ్రెసు నాయకులు ఇంకా జైళ్లలోనే వుండడంవల్ల, వారిని విడిపించడానికి ముస్లిం లీగు తన బాధ్యతను ఇంకా నెరవేర్చకపోవడంవల్ల వేలకొలది మన దేశస్థులు-చివరకు పాకిస్థాన్ కావాలనే ప్రాంతాలలోని వారే-వేలకొలది నాశనమైపోతున్నారనే విషయంకూడా ముస్లింలీగు గుర్తించాలి.

ఒకప్రక్క కాంగ్రెసుతోను, మరొకప్రక్క సామ్రాజ్యవాద ప్రభుత్వంతోను బేరాలాడుతూ కూర్చోడం పాకిస్థాన్‌కు దారితీయకపోగా మనబానిసత్వాన్ని ఇంకా ఎక్కువకాలం పొడిగించడానికే దారితీస్తుందనికూడా ముస్లింలీగు గ్రహించాలి.

కాంగ్రెసును మన కోర్కెను అంగీకరించేటట్లు చేసికొని మనవైపుకు త్రిప్పుకోనిదే, కాంగ్రెసుతో ఒడంబడిక చేసుకోనిదే పాకిస్థాన్ స్వరూపం చెందడమనేది అసంభవమనికూడ గ్రహించాలి.

అందుచేత మనమంతా ఒక విషయాన్ని గుర్తించాలి. పాకిస్థాన్‌కోర్కె, 1929 లాహోర్ కాంగ్రెసు గావించిన స్వాతంత్ర్య తీర్మానానికి అనుగుణ్యంగా జనించినదేగాని మరొకటికాదు. కాంగ్రెసు తన గౌరవప్రదమైన సాంప్రదాయానుసారంగా సోదరజాతులలో కలుగుతూన్న ఈ నూతన చైతన్యాన్ని ఆహ్వానించి వారి న్యాయమైన కోర్కెను అంగీకరించాలి. తద్వారా మనదేశాన్ని ఆవరించియున్న అనైక్యత అనే దుర్దశను అంతమొందించాలి. ప్రతిష్టంభనను తొలగించాలి.

(పీపుల్సువార్ 19 మార్చి 1944)

# ముస్లింప్రజలు ఐక్యతను వాంఛిస్తున్నారు

(1943 ఏప్రిల్‌లో ఢిల్లీలో జరిగిన ముస్లింలీగ్ మహాసభ సింహావలోకనం)

అఖిలభారత ముస్లింలీగ్ మహాసభ బహిరంగసమావేశం ఏప్రిల్ 24 వ తేదీ ఉదయం జరిగింది. ఈ సమావేశంలో ముఖ్యంగా గమనింపదగిన విషయం అధ్యక్షుని ఉపన్యాసం. అధ్యక్షుడు జిన్నా ఇంగ్లీషులో అనర్గళంగా 3 గంటలసేపు ఉపన్యసించాడు. ప్రేక్షకులు 25 లేక 30 వేల మంది దాకా వుంటారని అంచనా. ఇందులో ముస్లింలీగ్ కౌన్సిలు సభ్యులు 400 మంది ఉన్నారు. దేశం నలుమూలల నుండి ఏతెంచిన 1500 మంది ప్రతినిధులున్నారు. ఈ వేల మంది జనం. అధ్యక్షోపన్యాసం సాంతమయ్యేవరకు సావధానంగా కూర్చునివున్నారు. ఇది నాయకుల యెడల వారికిగల గౌరవాన్ని తెలియజేస్తోంది.

జిన్నా ఉపన్యాసంలోని ముఖ్య పాయింట్లేమిటి? అన్నిటికన్న ప్రముఖమైనది;- హిందూ ముస్లిం సఖ్యత తక్షణం సాధించవలసిన పనియని అతడు గుర్తించడం. జిన్నా ఇలా అన్నాడు :—

"ముస్లింలీగుతో ఒడంబడికకు రావాలని గాంధిగారు నిజంగా కోరినట్లయితే నాకంటె సంతోషించేవాడు మరొకడుండబోడు. అలా ఒడంబడికకు వచ్చినరోజు. హిందూ ముస్లిం ప్రజలిద్దరికీ, మహాసుదినం."

హిందూముస్లిం ఐక్యత. "సమస్యలలోకల్లా గట్టిసమస్య" "ఈతుచ్ఛ బ్రిటీషుప్రభుత్వం" విభజించి పరిపాలించుతుందని. మనం చేసే పొరపాట్లను అది అదనుగా తీసుకొంటుందని, జిన్నాఅన్నాడు. ఇంకా ఇలా అన్నాడు :

"మనల్ని విభజించి వుంచడానికి బ్రిటిషుప్రభుత్వం అనేకమార్గాలను వెదకుతుంది. దాని ఆ యెత్తులను భగ్నంచేసే మార్గాన్ని మనం కనిపెట్టాలి." ఐక్యంకండి! ఐక్యంకండి! ఐక్యంకండి! అని మనం బ్రిటిషువాళ్లను బయటకు పొమ్మని లేమా?"

హిందూప్రేక్షకులనుద్దేశించి జిన్నా ఇలా అన్నాడు.

"మీరు ఈ దేశప్రజల స్వాతంత్ర్యాన్ని కోరినట్లయితే, ఆ పోరాటంలోముందు శ్రేణిలో ముస్లిములు నిలబడతారు. "ఈ గృహకలహం మనకువద్దు; సంధిచేసి

కొందాం: మన మిద్దరం సమానహోదాతో కూర్చొని ఒడంబడిక చేసికొందాం" అని ముందుకు వచ్చిచెప్పేబాధ్యత మీది.

## ఒడంబడికకై విజ్ఞప్తి

జిన్నా ఐక్యతకై విజ్ఞప్తిచేస్తూ మాట్లాడిన ప్రతివాక్యానికీ హర్షధ్వానాలు చెల రేగాయి. ఒకప్రక్క అసమర్ధ నిరంకుశప్రభుత్వం నెత్తిన కూర్చొనివుంది. మరో ప్రక్క ఫేసిస్టుదండయాత్రా హెచ్చింది. ఇలాంటి అత్యంత ప్రమాదక్లిష్టపరిస్థితు లలో, ముస్లిం జన సామాన్యం ఐక్యతకై కదులుతున్నారంటే అశ్చర్యంలేదు. జిన్నా ఉపన్యాసం, ముస్లిం ప్రజాసామాన్యపు కదలికనే ప్రతిబింబించుతుంది. ఇంతకు ముందు ఎన్నడూ,ఇంతగట్టిగా ఇంతనిర్మాణయుక్తంగా కాంగ్రెసులీగులఐక్య తావసరాన్ని గురించి జిన్నా చెప్పలేదు. హిందూముస్లిం ఒడంబడికకై ఇంతటి అదుర్దా ఏనాడూ చూపించలేదు.

ఐక్యతను వాంఛించినంతమాత్రాన లాభంలేదు. ఐక్యతకై అవేదనపడ్డ మాత్రాన లాభంలేదు. ఐక్యతకై కృషిచేసి, దానికొక ఆకారం కల్పించి నిర్మిం చాలి. జిన్నా దానికై ఏమిచేయదలచుకొన్నాడు? ఈవిషయంలో అతనికిగల గొప్ప బాధ్యతను అతడు గుర్తించాడా? తన.రాజకీయ జీవితప్రారంభంనుండి. హిందూ ముస్లిం ఐక్యత తీసుకురావడానికై కృషిచేశానని, ఆవిధంగా తనవంతు కర్తవ్యాన్ని తాను పూర్తిచేస్తున్నానని, దాదాపు గంటసేపు జిన్నా ఉపన్యశించాడు. తానుగోఖలే దాదాభాయి నౌరోజీలకు శిష్యుడననీ, వారివద్దనుండే ఉత్సాహాన్ని పొందానని చెపుతూ వారిద్దరికీ అభివందనాలు తెలియజేశాడు. కాని "గాంధి నాయకత్వంక్రింద కాంగ్రెసు, హిందూ ముస్లింలిద్దరికీ స్వాతంత్రం సిద్ధించకుండా అడ్డుపడు తోంది. గాంధీజీ, హిందూనాయకత్వము అందరికీస్వరాజ్యం కోరడంలేదు.హిందూ రాజ్యమే కోరుతున్నారు." అంటూ జిన్నా ధోరణినడిచింది. గాంధీజీకి, కాంగ్రెసుకు వ్యతిరేకంగా ఈవిధంగా మాట్లాడడంద్వారా, ఐక్యతకై గల గాఢవాంఛను తాను భగ్నపరుస్తున్నాడని జిన్నాగుర్తించాడా? రెండుమహాసంస్థలమధ్య నాయకులమధ్య అత్యంత స్నేహం సామరస్యము ఉండవలసిన ఈసమయంలో, ఈవిధంగామాడట్లా టంవల్ల అనవసరంగా ఇరుపక్షాలమధ్య వైమనస్యం హెచ్చిపోతుందని జిన్నాగుర్తిం చాడా? ముస్లింహక్కు అయిన స్వయంనిర్ణయసూత్రాన్ని కాంగ్రెసుచేత, కాంగ్రెసు పజా సామాన్యంచేత ఒప్పించడానికి మార్గంఇదేనా? ఈసందర్భంలో నాకు అలిం డియా కాంగ్రెసుకమిటీ సమావేశాలు (బొంబాయి, అల్హాబాద్) జ్ఞాపకం వచ్చాయి ఆ సమావేశాలలో కొందరు కాంగ్రెసునాయకులు ఒకప్రక్క

ఐక్యతను గురించి నొక్కిచెబుతూనే, లీగ్‌తో రాయబారులు జరిపి ఒడం బడికకు రావాలని తమ సమ్మతిని చూపించుతూనే, మరొకప్రక్క లీగ్‌పై (ఇపుడు జిన్నా కాంగ్రెసుపై సాగించునట్లుగానే) దాడి సాగించారు.

ముస్లింలీగ్‌కు కమ్యూనిస్టుపార్టీ గావించిన విజ్ఞప్తిని గురించి జిన్నా ఇలా అన్నాడు. "కమ్యూనిస్టుపార్టీ ఈ రోజులలో బాగా ఉత్సాహకరమైన ('యాక్టివ్') పార్టీలాగా కనపడుతోంది. కాని వారి విజ్ఞప్తిలోని విషయాలు ప్రధానంగా తప్పు."

విజ్ఞప్తిలో మేం చెప్పిన దేమిటి? స్వయంనిర్ణయసూత్రాన్ని అంగీకరించ డానికి దేశం చాలావరకు ముందుకు కదిలిందని మా అభిప్రాయం; గాంధీజీకూడ వైస్రాయికి వ్రాసిన లేఖలలో హిందూ ముస్లిం సఖ్యతకై ఆదుర్దా చూపించాడు. ఇక లీగ్, కాంగ్రెసునాయకుల విడుదలను కోరుటకు చొరవచూపించాలి - సామ్రాజ్య వాదం అన్నదమ్ములను విడదీయడానికై కల్పించిన అడ్డంకులను, తద్వారా బ్రద్దలు చేయాలి. కాని జిన్నా చెప్పిందేమిటి? తన అభిప్రాయంలో, కాంగ్రెసులోగాని లేక హిందువులలోగాని మార్పు ఏమీ రాలేదట. కాని ఈ విషయంలోకూడ, ఇది వరకటివలె జిన్నా మొండిగా ఉండలేదు.

"గాంధీగారికి సమాచారం అంతా వస్తూనేవుంది. చుట్టూ ఏంజరుగుతుందో ఆయనకు తెలుసు. ఆయన నాకు తిన్నగా ఎందుకు వ్రాయకూడదు? అలావ్రాస్తే ఆయనను అడ్డుపెట్టగలవారెవరు? వైస్రాయిపైపుకు చూడటంవల్ల లాభంఏమిటి? ఈ దేశంలో ప్రభుత్వం బలంగాఉంటే ఉండవచ్చు. కాని అలాంటి ఉత్తరం గాంధీగారువ్రాస్తే, దానిని ఆపడానికి ఒక్క క్షణంగూడ ప్రభుత్వం సాహసించలే దని నా అభిప్రాయం. అలా ఉత్తరం ఆపేపక్షంలో అది తీవ్రంగా ఆలోచించవలసిన విషయమే"

ఈ ప్రకటనకు హర్షధ్వానాలు చెలరేగాయి. పరస్పర అనుమానాలున్నప్ప టికీ, ఒకరిపై ఒకరికి దురభిప్రాయం ఉన్నప్పటికీ, మన జాతీయ జీవనానికి ఐక్యతే శరణ్యం. ఆ ఐక్యత క్రమంగా ముందుకు వస్తోంది. జిన్నా ఉపన్యాసంలో నాన్-పార్టీ నాయకులు "ఇంకా ఎక్కువ ఉపయోగకరమైన పద్ధతులను" అవలంబించా లని సూచనలందిచ్చారు. "మహాపురుషులు సైతం తప్పులు చేస్తారు" అని అన్నాడు. ఇంతకూ, జిన్నా అభిప్రాయం ఏమంటే. హిందూ ముస్లిం ఐక్యత నిర్మించకుండా వైస్రాయి వద్దకు పోవడంవల్ల ఏమీలాభముండదని.

## ప్రభుత్వ ప్రతికూలత

బ్రిటిషు ప్రభుత్వం, తన అధికారాన్ని వదులుకోడానికి ఇష్టపడటంలేదు. దానిని నిర్దాక్షిణ్యంగా ఖండించాడు జిన్నా.

"కాంగ్రెసువారిని ఎదిరించుటద్వారా బ్రిటిషువారు ముస్లిములను తాము రక్షించుతున్నామని చెప్పుతున్నారు. కాని మేమనేదేమంటే: అది శుద్ధఅబద్ధం. మీరు (బ్రిటిష్ ప్రభుత్వం) మమ్మల్ని ప్రేమిస్తున్నారని నమ్మం....లార్డులిన్లిత్‌గో, అమెరీలు పక్కా డైహార్డు (కరడుగట్టిన) ముఠావారు. వాళ్లు ముస్లింలీగ్‌ను, ప్రతి ఇతర పార్టీని నిర్లక్ష్యం చేస్తున్నారు.... ముస్లిం ప్రజలకు సంబంధించినంతవరకు బ్రిటిషువారిపైగల ద్వేషం అపారం."

ఆవిధంగా జిన్నా మాటాడుతుంటే. బొంబాయి ఎ. ఐ. సి. సి. లో నెహ్రూ అజాద్‌ల క్రోధపూరిత ఉపన్యాసాలు నా చెవులలో గింగురుమన్నాయి. ఈయుద్ధం విషయంలో కూడ జిన్నా గట్టిగానేచెప్పాడు.

"ఈ యుద్ధాన్ని వుత్త ప్రేక్షకులుగాచూస్తూ కూర్చునేపాత్ర వహించడం, బ్రిటిషువారికిగాని, మిత్రరాజ్యాలకుగాని, మనకుగాని లాభకరమా? ఈ యుద్ధంలో ఓడిపోయేపక్షంలో, మనం హిట్లరు కాళ్ళక్రిందనో,ముస్సోలినీ కాళ్ళక్రిందనో నలిగి పోతాం. వాళ్ళు (బ్రిటిషు వాళ్ళు, అమెరికావాళ్ళు) లండన్‌కో, చికాగోకో పోతారు. మన మెక్కడికి పోతాం? ఈ యుద్ధంలో పోరాడి జయించాలని మనకంటె ఎవరెక్కువ అసక్తి చూపుతున్నారు? దురాక్రమణదారులు మ్రింగేది మన ఇళ్ళూ వాకిళ్ళూను.... కాని వాళ్ళ (ప్రభుత్వం) తోకవెంట నడవడం నాకు ఇష్టంలేదు. "మనం గెలిస్తే వాళ్ళు ఇప్పుడున్న స్థితిలోనే వుండిపోతారు; లేదా మనం ఓడి పోతామా, మనతోపాటు వాళ్లూ గంగలో కలుస్తారు" అనే జూదగాడిలా వుంది బ్రిటిషువారి వైఖరి."

యుద్ధంలోని అంతరార్థాలను గుర్తించడం ఒకటే దేశభక్తునికి చాలదు. "బుద్ధితక్కువ" సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా, మీవాదన ఏమిటో చెప్పుకో డమే సరిపోదు. ఈయుద్ధాన్ని మనయుద్ధంగా భావించడం అవసరం. సామ్రాజ్య వాదుల చేతులనుండి యుద్ధనిర్వహణాన్ని లాక్కొని ప్రజలచేతిలో పెట్టడం అవ సరం. ఇది జాతీయైక్యతద్వారానే సాధ్యమవుతుంది. 1942 అగస్టులో కాంగ్రెసు నాయకత్వం పొరపడిన అంశం ఇదొక్కటే; దురదృష్టవశాత్తు లీగుకూడ అదే విధంగా వ్యవహరించుతోంది.

జిన్నా ఉపన్యాసంలో గమనింపదగిన మరొకఅంశం ఏమంటే - భవిష్యత్తు పాకిస్తాన్ ప్రజాస్వామ్య ప్రాతిపదికపై వుంటుందని చెప్పడం.

"పాకిస్తాన్‌లో యుక్తవయస్సువచ్చిన వారందరికి ఓటు వుంటుంది. వారు, రాజ్యాంగాన్ని ఏర్పరిచే సంస్థకు ప్రతినిధులను ఎన్నుకొంటారు. ప్రజాస్వామ్యం మా నరనరాల్లో ఉప్పొంగుతోంది. ప్రజలకష్టాన్ని దోచుకొని బ్రతికే భూస్వాముల

కోసం, పెట్టుబడిదారులకోసం. నేను పనిచేస్తున్నానని తలిస్తే, నేనొక్క రోజు కూడా పనిచేయలేను. పెట్టుబడిదారులు, భూస్వాములు తెలివిగలవారయితే, ప్రస్తుత నూతన స్థితిగతులకు అనుగుణ్యంగా వారు తమ పద్ధతులను మార్చుకోవాలి. అలా మార్చుకోరూ, వాళ్ళఖర్మం! మనం ఏమీ చేయలేము."

సహజంగానే, జిన్నా ఉపన్యాసంలోని ఈభాగం ముస్లింలీగ్ సామాన్య సభ్యులలో బాగా చొచ్చుకుపోయింది. వారు నాతో మాట్లాడుతూ, పాకిస్తాన్ సోషలిస్టు రాజ్యమవుతుందనేవారు. అందుకు జిన్నా పల్కిన పైపలుక్కలను ఉల్లేఖించేవారు. లీగ్‌వర్కింగుకమిటీలో కుప్పలుతిప్పలుగాఉన్న నవాబులు, రాజాలు, సర్ బిరుదాంకితులు, క్వాయెద్-ఎ-అజాం జిన్నా ఉపన్యాసంలోని ఈభాగాన్ని, పైవారివలెనే సంతోషంగా ఆహ్వానించి యుండరనుకొంటాను. ఈ సూత్రాలనే మరింత స్పష్టంగా తీర్మానరూపంలో ప్రవేశపెట్టదలచిన డాక్టర్ అబ్దుల్ హమీద్ కాజీ, అబ్దుల్ మజీద్‌సింధీగార్లను, తీర్మానాన్ని ఉపసంహరించుకోమని జిన్నా కోరాడు. ఇందుకు పై నవాబులు, రాజాలు సంతోషించివుంటారు. ("ముస్లిం ప్రజలలో ఐక్యత"ను వాంఛించి) జిన్నా అలా ఆ తీర్మానాన్ని ఉపసంహరించుకోమని కోరాడని నాతోచెప్పారు. అయినప్పటికీ ఇదంతా, లీగ్ ఒకఅడుగు ముందుకు వేసిందని తెలియచేస్తోంది. ఇంతేగాక, సాధారణంగా ముస్లింలలోఉన్న అతివాద ధోరణినిగూడ స్పష్టంగా తెలియజేస్తోంది.

## తీర్మానాలు

రెండవ బహిరంగ మహాసభరాత్రి 10½ కు ప్రారంభమయింది. ఢిల్లీలో సాధారణంగా మీటింగులుపెట్టే సమయం ఇదే. ఈసభకు దాదాపు 50 వేలమంది ప్రజలువచ్చారు. రాత్రి ప్రశాంతంగా ఆహ్లాదకరంగావుంది. విద్యుద్దీపాలతో బాగా అలంకరించబడిన పందిరిఅంతా నిండిపోయింది.

ఈక్రింది విషయాలకు సంబంధించిన తీర్మానాలు గావించబడినాయి.

(1) దక్షిణాఫ్రికాలోని ప్లాక్‌బిల్లు (2) ఆహారము, అవసరవస్తువులు (3) సమిష్టి జరిమానాలు (4) సింధులో మార్షల్‌లా (5) పీర్‌పగారోను గురించి

దక్షిణాఫ్రికాలో భారతీయులకు విరుద్ధంగా చేయబోయే చట్టం, "ఘోరాతిఘోరమైన చట్టం" అని జిన్నా అన్నాడు. బ్రిటిషు ప్రభుత్వం ఈ విషయంలో జోక్యం కలుగచేసికోవాలని తీర్మానం చేయబడింది.

ఆహారం, అవసరవస్తువుల సప్లయిల గురించిన తీర్మానంలో ప్రభుత్వం అవలంబించుతున్న విధానాన్ని తీవ్రంగా ఖండించారు. ప్రభుత్వం అవలంబించే విధానం

లంచగొండి తనానికి, దొంగమార్కెట్టుకు, ప్రజలదోపిడికి" దారితీస్తున్నదని ఈ తీర్మానంలో తెలుపబడింది.

సర్ జియాయుద్దీన్ అహమ్మద్ ఆహార తీర్మానాన్ని ప్రతిపాదించాడు. హుస్సేన్ ఇమాం దానిని బలపరిచాడు.

హుస్సేన్ ఇమామ్ బీహార్‌నుండి వచ్చాడు. బీహారులో ముస్లింలీగ్‌వారు ఆహారకమిటీలలో చేరుతున్నారు. ఆహారకమిటీలను ఏర్పరుచుతున్నారు. అందుచే ఇమాం నిజమైన ప్రజాప్రతినిధిగా మాట్లాడడంలో ఆశ్చర్యంలేదు. ఆహారసమస్యపై ముస్లింలీగ్‌తో కలిసి పనిచెయ్యడానికి అంతులేని అవకాశాన్ని ఈ తీర్మానం ఇస్తోంది.

సమిష్టి జరిమానాల విషయమై గావించిన తీర్మానంలో, సమిష్టి జరిమానాలను, సమిష్టిరక్షణ ఉత్తరువులను ముస్లింలకు వర్తింపజేయరాదని అన్నారు, యావత్తుదేశానికి ప్రమాదంవున్న ఈక్లిష్టసమయంలో, బీదలైన రైతాంగంపై జరిమానాలు విధించుటవల్ల వారి మనోనిబ్బరం చెడిపోతుంది. కాబట్టి సమిష్టి జరిమానాలను విధించే ప్రభుత్వపాలసీనంతనూ వ్యతిరేకించి అసమ్మతి చూపవలసింది. కాని ఈ తీర్మానంలో అలాచేయనందువల్ల, ఇది అసంతృప్తికరంగా వుంది.

సింధులో మార్షల్‌లాను ఉపసంహరించుకోవాలని, పీర్‌పగారోను ఉరితీసినందుకు అసమ్మతి దెలుపుతూ ఒక తీర్మానం చేయబడింది. దీనిని సింధు ముస్లింలీగ్ మంత్రులొకరు ప్రవేశపెట్టారు. మరొకమంత్రి బలపరచారు. . ఇది అక్కడ రాష్ట్రస్వపరిపాలనలోని బూటకాన్ని తెలియజేస్తుంది.

ఇకరాజకీయతీర్మానానికి వద్దాం. ఇందులో దాదాపు సగభాగం 1942 ఆగస్టు 20న బొంబాయిలో లీగ్ వర్కింగ్‌కమిటీ ప్యాస్‌చేసిన తీర్మానంనుండి ఉల్లేఖించబడినదే. అందులో ఏముంది:-నిజమైన అధికారాన్ని గనుక తమకు ఇచ్చినట్లయితే దేశరక్షణ భారాన్ని తాను వహించుతానని లీగ్ అన్నది _కాని బ్రిటిషుప్రభుత్వం దీన్ని "పూర్తిగా నిర్లక్ష్యంచేసింది." బ్రిటిషుప్రభుత్వపు ఈ వైఖరికి లీగ్ అసమ్మతి తెలియజేస్తోంది. ఇంతేగాక, క్రిప్సు సూచనలను లీగు విమర్శించింది. క్రిప్సు సూచనలు దాదాపుగా కాంగ్రెసుకోర్కెను అంగీకరించుతున్నాయట. తమకు ఇష్టంలేకపోతే ఫెడరల్‌యూనియన్‌లో బలవంతంగా ఉండవక్కరలేదు. అన్న కాంగ్రెసుధోరణిలోనే క్రిప్సు సూచనవుంది. గాని స్పష్టంగా స్వయం నిర్ణయహక్కును గుర్తించడం లేదని జిన్నా అన్నాడు,

స్వయంనిర్ణయ హక్కును అనగా పాకిస్తాన్‌ను, బ్రిటిషుప్రభుత్వం స్పష్టంగాను, ఖచ్చితంగాను గుర్తించాలి.

తీర్మానంలోని చివరిరెండుపేరాలు క్రొత్తగా చేర్చబడినాయి. తీర్మానంలోని ఈ చివరభాగంలో "ఫెడరల్ శాసనాన్ని బ్రిటిషుప్రభుత్వం ఇండియాపై రుద్దినట్లయితే. ముస్లిములు దానిని నిరోధించుతారు. తత్ఫలితంగా కలిగే "ఘర్షణకు రక్తపాతానికి, విషాదానికి – వీటన్నిటికీ బాధ్యత బ్రిటిషుప్రభుత్వం ఒక్కదానిపైననే వుంటుంది." ఇంకా ముస్లిములను ఈవిధంగా ఈతీర్మానం హెచ్చరించింది. "పాకిస్తాన్ ఆశయాన్ని చేరాలంటే, ముస్లింల సంయుక్తప్రయత్నాలవల్లనే.ఇచ్ఛాపూర్వక త్యాగాలవల్లనేదృఢనిశ్చయంవల్లనే, సాధ్యమవుతుంది.అందుచే. పాకిస్తాన్ నుసాధించడానికి అవసరమైన బలాన్ని పొందడానికి తమ యావచ్ఛక్తినీ ఉపయోగించాలి"

ఈ తీర్మానంపై మాట్లాడినపుడు ముస్లిం నాయకులు గర్జించారు. నిప్పులు క్రక్కారు. ఇవి వింటూవుంటే. నాకు బొంబాయిలోజరిగిన అలిండియా కాంగ్రెసు కమిటీసభ జ్ఞప్తికివచ్చింది. బొంబాయి ఎ. ఐ. సి. సి. లో వలెనే ఇక్కడకూడా–

ఇది మనయుద్ధం – మనదేశాన్ని రక్షించుకోవలసిన ప్రధాన బాధ్యత మనది – అని అర్థంచేసికోలేకపోయారు. మనదేశాన్ని ఇంకొకరు రక్షించనీయలేదనుకోడం అసంగతమైన విషయం. ఇంతేగాదు. బొంబాయి ఎ. ఐ. సి. సి. లో లీగ్‌ను వదలివేసినట్లుగానే, ఇక్కడకూడా లీగ్ దేశభక్తియుతమైన మహాసంస్థ (కాంగ్రెసు)నూ, కాంగ్రెసు నాయకత్వాన్నీ లెక్కచేయక తృణీకరించింది. "కఠిన" సామ్రాజ్యవాదులపై కొన్ని సవాళ్ళు సూచాయగా అందిచ్చారు. ఏదోరకమైన 'పోరాటం' చేయబడుతుందని బెదరించారు. తమ జీవితాలను ధారబోయడానికి సిద్ధంగా ఉండాలనీ "ఊరికే జైలుకుపోవడంకాదనీ"–కాంగ్రెసువాదులూ. హిందువులూ దీనినిగురించి ఏమనుకొన్నా లెక్కచేయవలదనీ. ఉద్బోధించారు. కాంగ్రెసూ, గాంధిజీ, "మొదట స్వాతంత్ర్యం తర్వాత ఐక్యత" అని అన్నారనే, వారిపైన లీగుకు ప్రధానంగా ఇంత గుర్రువుందని నేను గ్రహించాను.

సరిగ్గా ఆదేవిధంగా ముస్లిం ప్రజలముందుకూడా వారు ప్రబోధించుతున్నారు: కాంగ్రెసు నాయకులుకూడా, లీగ్‌కు స్వాతంత్ర్యం అక్కరలేదుకాబట్టి లీగ్‌తో ఒడంబడిక సాధ్యంకాలేదని చెప్పారు. లీగ్ నాయకులిదే తిరిగి వల్లించుతున్నారు.

## పాఠాలు

గత పదినెలల అనుభవము లీగ్ నాయకులకు ఏమీ పాఠం నేర్పలేదా? అగస్టులో కాంగ్రెసు నాయకులు గావించిన తప్పులనే మీరుకూడ తిరిగి చేయబోతున్నారా? ఆహారసమస్యా పరిష్కారానికి, దేశరక్షణకు, సంయుక్త జాతీయ ప్రభుత్వానికి మన దేశప్రజల నందరినీ ఐక్యపరచుటొక్కటే. సజీవమైన ఐక్యత

ఒక్కటే. ఈ అంధకారంనుండి తప్పించుకొనడానికి మార్గంఅన్న విషయాన్ని వారు గుర్తించరా ?

ముస్లింలీగ్ బలపడుతున్నందుకు, లీగ్‌చుట్టూ స్వాతంత్ర్యకాముకులైన ప్రజలను లక్షలాదిగా సమీకరించుతున్నందుకు భారతదేశ ముస్లింలందరూ-ఇంతేల-యావత్ భారతదేశము హర్షించుతోంది. ఇది శుభసూచకం. కాని, ప్రస్తుతం మనల్ని ఎదుర్కొనుచున్న దేశరక్షణ—ఆహారసమస్య—స్వయంనిర్ణయహక్కు — దేశస్వాతంత్ర్యం—మొదలగు సమస్యలను లీగ్ పరిష్కరించ గల్గిందా లేదా అని లీగును ముస్లిములు, ఇతర భారతీయులు పరీక్షచేసి చూస్తారు. ఈ సమస్యాపరిష్కారానికి మార్గం ఒక్కటే; అది, మన దేశంలోని దేశభక్తసంస్థలు రెండూ ఐక్యమవడం. తమ నందరినీ ఎదుర్కొనుచున్న ప్రమాదాలను—ఆపదలను — తమంతకు తామే స్వీయబలంతో ఎదుర్కోడానికి ప్రజలనందరినీ కాంగ్రెసు—లీగు ఐక్యపతాకక్రింద సమీకరించడం ఒక్కటేమార్గం. లీగు గనుక ముందుకువచ్చి ఐక్యతకొరకు పని చేయకపోతే; కాంగ్రెసును నిందిస్తూ కూర్చునివుంటే; "పోరాటం" అనే దాని బెదిరింపు, కాంగ్రెసు ముఠాలో విచ్ఛిన్నం కల్గించనట్లుగానే, లీగ్ ముఠాలోకూడా విచ్ఛిన్నం తెచ్చిపెడుతుంది. ఇతరులపై ఒత్తిడితేవాలి, అనే ఎత్తుగడలు ముస్లింప్రజల మనోనిబ్బరం చెడగొడతాయి. అంతేగాక, ఓటమి తత్వాన్ని పురిగొల్పి, సామ్రాజ్యవాదుల చిన్న భాగస్వాములుగా వైస్రాయి కార్యనిర్వాహక వర్గంలో కొందరు చేరడానికి దారితీస్తుంది. నిజమైన అధికారం మాత్రం సామ్రాజ్యవాదులు అప్పగించరు.

ముస్లిం ప్రజాసామాన్యం ఐక్యత కోరుతున్నదనే విషయంలో ఎలాంటి సందేహమూలేదు. వారు ఐక్యతకై సంసిద్ధంగా ఉన్నారు. వారి మనోభావం కొంత వరకు నాయకత్వంలోకూడ కన్పించుతోంది. జిన్నాకూడ చాలవరకు ఐక్యతకై ముందుకు వచ్చాడు,

ముస్లిమేతరప్రజలు, స్వయంనిర్ణయాధికారాన్ని అంగీకరించుట మీదను—కాంగ్రెసునాయకుల విడుదలకై ముస్లింలీగ్ కదలాలనేకోర్కె జయించుట మీదను అంతా ఆధారపడివుంది.

(9—5—43)

# ఢిల్లీ సమావేశం

(1943 నవంబరు 14,15)

అఖిలభారత ముస్లింలీగ్ కౌన్సిల్ మొత్తం సభ్యత్వం 500. ఢిల్లీలో జరిగిన లీగ్ కౌన్సిల్ సమావేశానికి వందమంది సభ్యులు మాత్రమే హాజరయారు. అరేబిక్ కాలేజి హాలులో జరిగిందీ సమావేశం. హాలులో ఎలాంటి అలంకారాలు లేవు. నినాదాలు. బేనర్లమాట అటుంచి, చివరకు ఒక ముస్లింలీగ్ జండా అయినా లేదు. ఇక ప్రేక్షకుల గేలరీలో 150, 200 వందలమంది కన్నా ఎక్కువలేరు.

ఏమిటీ చిత్రం ? అయిదు రాష్ట్రాలలో లీగ్ మంత్రివర్గాలు పరిపాలన సాగిస్తున్నాయి. ముస్లిం ప్రజాసామాన్యంలో లీగు పలుకుబడి నానాటికి పెరుగుతూంది. సింధు, సరిహద్దు, బెంగాల్‌రాష్ట్రాలలో ఇటీవల జరిగిన ఎన్నికలలో లీగు పొందిన అఖండవిజయాలే ఈపలుకుబడికి నిదర్శనం. ఇలాంటి ముస్లింలీగ్‌లో, ఒక అఖిల భారత వార్షికసమావేశానికి, మరో వార్షిక సమావేశానికి మధ్య సర్వాధికారం నిర్వహించగల కమిటీ లీగ్ కౌన్సిల్. అంత ప్రాముఖ్యతగల కౌన్సిల్ సమావేశమవుతూంది. అయినా ఉత్సాహం ఏమూలా కనబడదు. వచ్చి పాల్గొన్నవారుకూడ బహుకొద్దిమంది,

ఎవరికయినా ఇది వింతగా తోచకతప్పదు. ఒకవైపు లీగ్ పరపతి పెరుగుతూంది; మరోవైపు; 'చరిత్రాత్మకమ'ని 'డాన్' పత్రిక పేర్కొన్న ఈకౌన్సిల్ సమావేశానికి వచ్చినవారు ఇంతకొద్దిమంది. ఇందుకు కారణం తెలుసుకోవడం కష్టంకాదు.

## జిన్నా ఉపన్యాసం

రాబోయే లీగ్ సమావేశానికి అధ్యక్షునిగా జిన్నాను ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు. ఈఎన్నిక జరిగినమీదట జిన్నా ఒక చిన్న ఉపన్యాసంచేశాడు. తనను హత్యచేయడానికి జరిగిన ప్రయత్నాన్ని సభ్యులు ఖండిస్తూ తనపట్ల వెల్లడిచేసిన అనురాగానికి, విశ్వాసానికి తానెంతో మురిసిపోయానన్నాడు.

అధ్యక్షుణ్ణి, కార్యవర్గాన్ని ప్రతిఏటా ఎన్నుకోవడం చాల మంచిదన్నాడు. లీగు సవ్యంగా ప్రవర్తించేలా చేయడానికి ఇదొకమార్గమన్నాడు. లీగు నిబంధనావళి ప్రజాస్వామికానికి స్వరూపమన్నాడు. "నాయకుని విధానం మీకు అంగికారం

కాకపోతే పరిష్కారం మీచేతిలోనే ఉంది. మీఇష్టాయిష్టాలపైనే మేమాధారపడి ఉన్నామ" న్నాడు.

కత్తులతోను, రౌడీపద్ధతులతోను, సమస్యలను పరిష్కరించాలనే ధోరణిని ఖండించాడు. ఒక్క విశ్వాసరాహిత్య తీర్మానంతో లీగ్‌కౌన్సిల్ తనను అధ్యక్ష స్థానంనుంచి 24 గంటల్లో తొలగించగలదన్నాడు.

ఈ మాటలు చెప్పి జిన్నారాజకీయ పరిస్థితులవైపు తిరిగాడు. గత అఖిల భారత ముస్లింలీగ్ సమావేశం (1943 ఏప్రిల్) తరువాత భారతరాజకీయరంగంలో కొత్తవిషయాలేమీ జరగలేదు. కాబట్టి తాను చేయగలదంతా ప్రస్తుతపరిస్థితిని తిరిగి వివరించడమే నన్నాడు.

భౌగోళికంగా ఇండియాఅంతా ఏకఖండమని నిరూపించడానికి సామ్రాజ్య వాదులు, 'అఖండహిందూస్థాన్' వాదులు కొత్తవాదనలను లేవదీశారు. ఇవన్నీ హాస్యాస్పదము లన్నాడు జిన్నా. బ్రిటన్‌లోని కరుడుగట్టిన టోరీ సామ్రాజ్య వాదులు భారతదేశాన్ని తమ పిశాచికౌగిలిలోంచి వదలడానికి ఇష్టపడడంలేదనిచెప్పి జిన్నా తీవ్రంగా ఖండించాడు. హిందువులను, ముస్లింలను, తమకింద బానిసలుగ ఉంచుకోవడమే ఈ సామ్రాజ్యవాదుల ఏకైకఆశయమని హెచ్చరించారు.

తరువాత ఎంతో ఉద్వేగంతో ఇలాఅన్నాడు: "పాకిస్తాన్ మూల సూత్రం ఏమంటే హిందువులకు, ముస్లిములకు స్వాతంత్ర్యము ఉండం ....హిందువులకు హిందూస్థాన్ స్వాతంత్ర్యం లభించనిదే మనకు పాకి స్థాన్ ప్రాప్తించడంకల్ల" ఈ దృక్పథంతో హిందూ-ముస్లిం సమస్యా పరిష్కారానికి పూనుకోవాలని విజ్ఞప్తిచేస్తూ ఇలాఅన్నాడు: "ఐకమత్యం కుదుర్చుకోకుండా ఉండడంవల్ల మనం మనందరివిరోధి అయిన బ్రిటిష్ సామ్రాజ్యవాదులచేతిలో పడిపోతున్నాం" హిందూ-ముస్లిం రాయబారాలకు లీగుసూచనలను ప్రాతిపదికగా అంగీకరించవలసిందని హిందువులను కోరాడు. అలా అంగీకరిచకుండా ఉండడం చాలాప్రమాదకరమైనధోరణి. అందరినీ నట్టేటముంచుతుందని హెచ్చరించాడు.

ఇక బెంగాల్‌విషయం. అక్కడి కరువుపరిస్థితి కంతటికీ బాధ్యత నిరంకుశ ప్రభుత్వానిదే అని నొక్కి చెప్పాడు. "ఇది మానవకల్పితమైన కరువు. ఇండియా లోని బ్రిటిష్ పరిపాలన చరిత్రకే ఇదొక మాయనిమచ్చ." అని ఖండించాడు. నాజిముద్దీన్ మంత్రివర్గాన్ని అభినందించాడు. దాన్ని బెంగాల్లో చెలరేగుతూన్న ఆకలిమంటలను ఆర్పడానికి పాటుపడుతూన్న అగ్నిమాపకదళం అన్నాడు.

భారతీయు లందరూ - రాజకీయ విభేదాలను పాటించకుండా, ముందుకువచ్చి బెంగాలుకి తోడ్పడాలని ఉద్బోధించాడు.

జిన్నా మాటలనుబట్టి ఒక విషయం స్పష్ట మయింది. బ్రిటిష్‌ప్రభుత్వం తన అధికారాన్ని వదలుకోడానికి ఇష్టపడదని జిన్నా పూర్తిగా గ్రహించాడు. హిందువులకు ముస్లింలకు - అంటే కాంగ్రెసుకు లీగుకు - పరిష్కారం కుదరనిదే పరిస్థితులు బాగుపడవనికూడా గుర్తించాడు. కాని పరిష్కారానికి అతను చూపిన మార్గం ఏమిటి? ఈపరిష్కారానికి పాకిస్థాన్‌సూత్రాన్ని ప్రాతిపదికగా తీసుకోవాలని అనడం తప్ప అతను మరేమీ చెప్పలేదు. కాంగ్రెసునాయకుల విడుదలను కోరుతూ పల్లెత్తు మాటయినా అనలేదు. నిజం చెప్పాలంటే పరిష్కారమార్గం ఏదీ సూచించలేదు.

ఈ వైఖరి పర్యవసానం ఏమిటి? రాజకీయంగా చొరవతీసుకొనే అవకాశాన్ని సామ్రాజ్యవాదులచేతుల్లోనే విడిచిపెడుతూంది ముస్లింలీగు. ఇందువల్ల దేశం అధోగతిపాలవుతూంది. లక్షలాది సోదర భారతీయులు ఘోర మరణాల పాలవుతున్నారు.

ఆహారసమస్య విషయంలో లీగునాయకుల ధోరణికూడా చాల అసంతృప్తికరంగా ఉంది. ఆవిషయంలోకూడా చొరవలేదు; రాజకీయ, ఆర్థిక విషమ పరిస్థితులను తొలగించడానికి ఒక నిర్మాణకార్యక్రమాన్ని సూచించాలనే దృష్టేలేదు.

బెంగాల్లోని భయంకర కరువు పరిస్థితులు భారతదేశంలోని ముస్లింల నందరిని జలదరింప జేసిందనడానికి సందేహంలేదు. లీగ్‌కౌన్సిల్‌నికూడా ఇది ఎంతో కదిల్చింది. సమావేశంలో ఆహారసమస్యను గురించిన తీర్మానాలపైని, వాటి సవరణలపైని జరిగిన వాదోపవాదాలే ఇందుకు నిదర్శనం. అధిక లాభాపేక్షను, దొంగ నిలవలను అరికట్టి తీరాలని దేశంలోని లీగుసభ్యులందరూ ఖచ్చితంగా కోరుతూన్నట్లు ఈ చర్చల్లో తేలింది. రేషనింగు, ధరల కంట్రోలు అమలు జరపాలనీ: వీటి విషయంలో లీగు నిర్ణయించిన విధానాన్నే యూనియనిస్టు మంత్రివర్గం అనుసరించాలనీ, లీగుసభ్యులందరూ కోరుతున్నట్లు వెల్లడయింది. ఆహారపదార్థాలను, ఇతర జీవితావసర సరకులను, స్వీకరించి, కంట్రోలుచేసి సవ్యంగా సరఫరా చేసేవిషయంలో కేంద్ర ప్రభుత్వం దేశమంతటా ఒకే విధానాన్ని అనుసరించాలని వీరి వాంఛ.

## తిండిదొంగల నరికట్టాలి

ఉదాహరణకు, షేక్ అబ్దుల్ సలామ్ (ఢిల్లీరాష్ట్ర ముస్లింలీగ్ అధ్యక్షుడు) ప్రతిపాదించిన తీర్మానంలో ఈ దిగువ విషయం ఉంది:

"ఆహార పదార్థాలను దొంగతనంగా నిలవచేయడాన్ని ఈ సమావేశం తీవ్రంగా ఖండిస్తుంది. ప్రతిపట్టణంలోను, పల్లెలోను, ఈ తిండి దొంగలను బట్టబయలుచేసి, ఎక్కడా వారిఆటలు సాగకుండా చేయాలని ప్రతిరాష్ట్ర, ప్రాథమిక, లీగుకమిటీని హెచ్చరిస్తుంది."

పంజాబురాష్ట్ర ముస్లింవిద్యార్థి ఫెడరేషన్ మాజీ అధ్యక్షుడయిన హమీద్ నిజామీ ఈ తీర్మానాని కొక సవరణ సూచించాడు. "రేషనింగును, కంట్రోలును, అమలు జరిపేటప్పుడు ప్రజాప్రతినిధుల సలహాతో పనిచేయాల"ని ఈసవరణను సూచిస్తూ అతను పంజాబు మంత్రివర్గాన్నీ; హిందూ, ముస్లిం, బ్రిటిష్ తిండిదొంగలను మహాతీవ్రంగా ఖండించాడు.

నిజామీ అంకుశపోట్లులనుండి తనను కాపాడాలని పంజాబ్ ప్రధాని అధ్యక్షుని కోరుకోవలసివచ్చింది. పంజాబు మంత్రివర్గాన్ని పేరెత్తి ఎత్తిపొడవకూడదని జిన్నా ఆదేశించాడు. అందువల్ల సర్ ఛోటురాం చేష్టలను సవిస్తరంగా వెల్లడిచేయడానికి వీలులేకపోయింది. అయినా నిజామీ తాను చెప్పదలచుకొన్న ముఖ్యవిషయాలన్నిటినీ నొక్కిచెప్పేశాడు. కేంద్ర, రాష్ట్ర, ప్రభుత్వాల తెరమరుగునున్న అన్ని జాతుల తిండిదొంగలను లీగు ఎదుర్కొని, హతమార్చాలని అతనన్నప్పుడు; దేశమంతటా - పంజాబులోకూడా రేషనింగ్, ధరల కంట్రోలు అమలుజరపాలని కోరినప్పుడూ - సభ్యులుకరతాళ ధ్వనులతో తమ ఆమోదాన్ని వెల్లడించారు.

అన్నిటికన్నా ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే - సింధురాష్ట్ర ప్రధాని సర్ గులాం హుస్సేన్ హిదయతుల్లా, కంట్రోలు, రేషనింగులను సమర్థిస్తూ ఉత్తేజకరంగా మాట్లాడాడు. లీగ్ నాయకత్వం ఈరెండింటినీ తప్పకుండా అమలు జరిపించగలదని చెప్పాడు. "ఈ విషయంలో నాయకత్వం వహించి, రాష్ట్ర ప్రభుత్వాలకు మార్గం చూపండ"ని జిన్నాను కోరాడు. సరిహద్దురాష్ట్రప్రధాని సర్దార్ ఔరంగజేబ్‌ఖాన్, బెంగాల్ ప్రధాని సర్ నాజిముద్దీన్‌కూడా ఈ దృక్పథాన్ని సమర్థిస్తున్నారని సమావేశంలో అందరూ అనుకున్నారు.

ఈవిధంగా అన్నివైపులనుండి కురుస్తున్న సుత్తిపెట్టులనుండి తట్టుకోడానికి పంజాబు తిండిదొంగల ప్రతినిధులు కౌన్సిల్లోతమతరపున మాట్లాడ్డానికి రాజా ఘజన్‌ఫర్ అలీని నియమించారు. ఈయన యూనియనిస్టు మంత్రివర్గానికి పార్లమెంటరీకార్యదర్శుల్లో ఒకడు. ఈ రాజాసాహెబ్ మాట్లాడాడు. అంతకన్నా దగాకోరుఉపన్యాసాన్ని ఊహించనయినా ఊహించలేము. కేంద్రప్రభుత్వాన్నిదుమ్మెత్తిపోశాడు. అది ఏమీచేతకాని ప్రభుత్వమన్నాడు. పంజాబునుంచి పంపిన గోధుమ

లను బెంగాలుకు చేరవేయడమయినా దానికి చేతకాకపోయిందన్నాడు. ఇప్పుడు కావలసింది కంట్రోలు, రేషనింగులు కానేకాదన్నాడు. అధికాహారోత్పత్తే ఇప్పుడు అత్యవసరమన్నాడు.

కంట్రోలు, రేషనింగులను వ్యతిరేకిస్తూ పంజాబు ముస్లింలీగు ఏకగ్రీవంగా తీర్మానించిందని అతనన్న మాటలను నిజామీ ఖండించాడు. ఆతీర్మానాన్ని చేసింది పంజాబులీగువర్కింగుకమిటీఅని నిజామీతెలిపాడు. అక్కడయినాఅదిఏకగ్రీవంగా ఆమోదింపబడలేదని చెప్పాడు. ఈ విషయంలో జిన్నా కూడా మాట్లాడవలసి వచ్చింది. అలాంటి తీర్మానం జరిగినసంగతి తనకూడా తెలియదని జిన్నా చెప్పాడు. ఇక రాజాసాహెబ్ ఉక్కిరిబిక్కిరై ప్లేటుమార్చక తప్పిందికాదు. జాతీయప్రభుత్వంగాని, జిన్నాగాని, ధరలకంట్రోలును అమలుజరపమని కోరిన ట్లయితే తాము తప్పక అమలుజరుపుతామన్నాడు. ఈమాటలను పరిహసిస్తూ సభికులందరూ నవ్వారు. "ధరల కంట్రోలొక మహాపాపకార్యం" అంటూ అతను ఉపన్యాసం ముగించాడు.

కౌన్సిల్‌సభ్యులలో చాలమంది అభిప్రాయం ఈభావానికి పూర్తిగా వ్యతిరేక మన్నది సుస్పష్టం. వాళ్ళ దృష్టిలో తిండిదొంగకన్నా పరమపాపి మరొకడులేడు. వాడిపట్ల దయాదాక్షిణ్యాలు అణుమాత్రమయినా చూపాలనేభావం వారికిలేదు. కాని జిన్నా వారితోకలిసిరాలేదు. కంట్రోలు, రేషనింగుల విషయంలో చేయవలసిన ఏర్పాటులనుగురించి కేంద్రప్రభుత్వానికి, రాష్ట్ర మంత్రివర్గాలకు సవివరంగా సూచన లివ్వనక్కరలేదనే వైఖరి నాయన అవలంబించాడు.

## తుదినిర్ణయం

షేక్ అబ్దుల్ సలామ్ తీర్మానంలోను, హమీద్ నిజామీ సవరణలోను సూచించిన చర్యలకు తాను వ్యతిరేకిని కానన్నాడు జిన్నా. కాని, "దేశంలోని ఆహారసమస్యను పరిష్కరించడానికి తగినచర్యలు తీసుకోవాల"ని ఇండియా ప్రభుత్వాన్ని కోరితే చాలని ఆయనతేల్చాడు. నవాబ్ ఇస్మాయిల్‌ఖాన్ (యు.పి.) ప్రతిపాదించిన అధికారతీర్మానంలోని ముఖ్యాంశం ఇదే మాటల్లో ఉంది. వర్కింగు కమిటీ ఆ తీర్మానాన్ని అదివరకే ఆమోదించింది. చివరకు కౌన్సిల్ ఆ తీర్మానాన్నే అంగీకరించింది.

అయిదురాష్ట్రాల లీగు ప్రధానమంత్రులను ప్రత్యేకంగాకలుసుకొని, సర్వత్రా అనుసరించతగిన ఆహారవిధానాన్ని గురించి సాకల్యంగా చర్చిస్తానని జిన్నా వెల్లడిచేశాడు. " ఈ అయిదురాష్ట్రాలకు సంబంధించినంతవరకు ముస్లిం ప్రధానులే పూర్తిబాధ్యత వహించాలి.....తమ కందరికీ వర్తించతగిన ఒక విధానాన్ని వారు

నిర్ణయించుకోవాలి. చేయవలసిందంతా మేము చేయటం లేదని మీరు అనుమానించవద్దు" అని ఆయన వివరించాడు.

సమావేశంలో జరిగిన చర్చల్లో ప్రధానపాత్ర వహించింది బెంగాల్ సమస్య. భారత ప్రభుత్వమూ, బ్రిటిషు ప్రభుత్వాలే బెంగాల్ పరిస్థితికి బాధ్యులని విమర్శించడం; లీగు మంత్రివర్గానికి పూర్తి మద్దతు నివ్వడం-ఇదీ ఈవిషయంలో వర్కింగుకమిటీ సూచించిన అధికారపంథా. "బెంగాల్ ప్రజలకు ధన, వస్తు సహాయం చేయండ"ని దేశంలోని ముస్లిం లందరికి విజ్ఞప్తి చేశారు.

బెంగాల్ పరిస్థితినిగురించి బెంగాల్ ప్రధాని ఒక పెద్ద స్టేటుమెంటు చదివాడు. తన మంత్రివర్గంపై అమెరీ మోపిన ఆరోపణలను ఖండించడానికి; భారత ప్రభుత్వం అనుసరిస్తూ వచ్చిన విధానమే బెంగాల్ పరిస్థితికి దారితీసిందని రుజువు చేయడానికి, అతను ప్రయత్నించాడు. బెంగాలుకు ఆహారధాన్యాలను సప్లయి చేయడానికి భారతప్రభుత్వం వేసిన ప్రతిప్లాను ఎలా భగ్నమయిందో వివరించాడు. ధాన్యం సరఫరాలకు ఇరుగుపొరుగు రాష్ట్రాలెలా అంతరాయాలు కలిగించాయో, క్రమక్రమంగా పరిస్థితు లెలా విషమించాయో విపులంగా తెలిపాడు.

పాకిస్థాన్‌లో స్వతంత్ర బెంగాల్ రాష్ట్రం అనుభవించగల సౌకర్యాలను, పొందగల సుఖాలను సర్ నాజిముద్దీన్ వర్ణించాడు ఇప్పుడైనా రాష్ట్రంలోనూ, బయటనుంచికూడా ఆహారధాన్యం సేకరించడానికి తన మంత్రివర్గం చేస్తున్న కృషి ఎంతచక్కనిదో వర్ణించాడు. బెంగాల్‌లో జరుగుతున్న కరువునివారణోద్యమాన్ని స్తుతించాడు.

ఈస్టేటుమెంటులో బెంగాల్‌లోని లీగు ప్రసక్తేలేదు; తిండిపొంగలవిషయం ఒక కట్టుకథ అని నిర్లక్ష్యం చేశారు; రాజకీయ పరిస్థితులనుగూర్చి ఒక్కమాటయినా లేదు; అన్ని పక్షాల ఐక్యమంత్రివర్గంయొక్క ఆవశ్యకత వెతికినా కనబడదు. ఆకలిమంటల్లో మాడిపోతూ చావుబ్రతుకులమధ్య కొట్టుకులాడుతూన్న లక్షలాది అభాగ్యుల నిజస్థితి ఈస్టేటుమెంటులో కనబడదు. ఈస్థితిలో జపాను విమానదాడుల ప్రమాదంగురించిన ఊసేలేదు. గుడ్డిధీమాతో ఉన్న నిరంకుశాధికారే ఇలాంటి స్టేటుమెంటు తయారుచేయగలడు గాని, బెంగాల్‌ముస్లిం ప్రజల నాయకుడు ఎన్నటికీ చేయలేడని నేననుకున్నాను.

భారతప్రభుత్వాన్ని ఖండించడం; అమెరీ అసత్యప్రలాపాలను బట్టబయలు చేయడం - ఇదంతా బాగానేఉంది. కాని భారతీయుల కివన్నీపాతవిషయాలే - క్రొత్తగా చెప్పవలసిన అవసరంలేదు. నేడు ప్రతి ముస్లింపౌరుడూ లీగుకౌన్సిల్ వైపు, లీగు నాయకత్వంవైపు ఆతృతతో చూస్తున్నది దేనికోసం? ప్రభుత్వ

అపమర్ధతవల్ల దేశమంతటా బిగుసుకున్న ఉచ్చుల్లోంచి, నేటి మహాక్లిష్టపరిస్థితు ల్లోంచి, జాడ్యాలబారినుండి, మృత్యుముఖంలోంచి బయటపడేమార్గంకోసం ఎదురు చూస్తున్నాడు.

## లీగు చొరవతీసుకోలేదు

ఈ మార్గాన్నే ఇంతవరకు లీగునాయకత్వం చూపలేకపోయింది. ఇతర ప్రజాపక్షాలతోచేతులుకలిపి తిండిదొంగలను, దొంగవ్యాపారస్తులను రూపుమాపడం కోసం ముస్లింప్రజాసామాన్యాన్ని ఈ నాయకత్వం సమీకరించడంలేదు. కాంగ్రెసు నాయకులను విడుదలచేయాలనే కోరికను తనశక్తి అంతటితో బలపరచడంలేదు. నాయకత్వంవహించి, జాతీయైక్యతకోసం ఉద్యమాన్ని సాగించడంలేదు. కాని తన స్థితిని చెప్పుకొని, తన కోరికలను వెల్లడిచేయడంతో తృప్తిపడి ఊరుకుంది. ఈ వ్యాసం మొదట్లోచెప్పిన వింతపరిస్థితికి కారణంఇదే. లీగుయొక్క పలుకు బడి పెరగడంతోపాటు,దాని నిర్మాణాభివృద్ధికలగడంలేదు; స్వయంనిర్ణయహక్కును, స్వాతంత్ర్యాన్ని సాధించడానికి ముస్లింప్రజల సంఘటితశక్తి హెచ్చడంలేదు.

ఖాక్సారుసభ్యులెవ్వరూ లీగులో చేరగూడదని నిషేధిస్తూ ఒకతీర్మానం చేసింది లీగు. కాని ప్రస్తుతరాజకీయ ప్రతిష్టంభనను తొలగించడానికి తాము ఏలాంటి నిర్మాణకార్యక్రమాన్ని అవలంబించకపోవడమే ముస్లింప్రజలలో చీలిక లకు అవకాశం కలిగిస్తున్నదని లీగు నాయకులు గుర్తించడంలేదు.

ఈవిషయాన్ని మౌలానాజఫర్‌అలీఖాన్ కౌన్సిల్‌ముందుకుతెచ్చాడు. లిబనాన్ స్వాతంత్ర్యాన్ని తిరిగి ప్రతిష్ఠించాలనే తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ ఆయన ఇలా మాట్లాడాడు.

"అరబ్బురాజ్యాలు - ముస్లిం అరబ్బులు, క్రిస్టియన్ అరబ్బులనే భేదం లేకుండా, ఈనాడు ఐకమత్యంతో నిలిచిఉన్నాయి. ఆదేశాలు తమ కోరికలను సాధించుకొంటాయి. ఇందుకు సందేహంలేదు। మనదేశంలో హిందువులు, ముస్లింలు ఏకమయితే, గాంధీజీ, జిన్నాలు కలుసుకొని ఒడంబడిక కుదుర్చుకుంటే, మనదేశంకూడా ఒక బలవత్తరమైన దేశంగా వర్ధిల్లగలదు."

ప్రస్తుత క్లిష్టపరిస్థితుల్లోంచి బయటపడడానికి విస్పష్టమైన కార్యక్రమం తీసుకోవాలనే భావం లీగులోని యువకవర్గాలో నానాటికి పెరుగుతూంది. ఆహార ధాన్యాలకు, బట్టలకు, ఇతరజీవితావసర సరకులకు తక్షణం ధరలు నిర్ణయించాలని

అఖిలభారత ముస్లిం విద్యార్థి సంఘకార్యనిర్వాహకవర్గం తీర్మానించింది. ఇలాంటి తీర్మానాలేవీ జరక్కుండా చేయడానికి పంజాబు యూనియనిస్టు మంత్రివర్గం ఎంతో ఒత్తిడి తెచ్చింది. అయినా ఆ విద్యార్థి నాయకులు లొంగలేదు. (ఢిల్లీలో లీగు కౌన్సిల్ సమావేశం జరుగుతూన్నప్పుడు యూనియనిస్టు మంత్రివర్గసభ్యులయిన సర్ ఛోటురాం, బల్దేవ్‌సింగు లిద్దరూ ఢిల్లీలోనే ఉన్నారు. ఇది గమనించవలసిన విషయం.)

కేంద్రప్రభుత్వ కార్యనిర్వాహకవర్గం, ప్రజలకు ప్రాతినిధ్యం వహించేదికాదు. కాబట్టి, ఈ ధరల కంట్రోలుసమస్యను పరిష్కరించ లేకపోయిందని ఆతీర్మానంలో స్పష్టపరిచారు. అందువల్ల, ముస్లింలీగు, ఇతర ప్రజాపక్షాలతో కలిసి కేంద్రంలో ప్రజాప్రభుత్వాన్ని నెలకొల్పడానికి పూనుకోవాలని విజ్ఞప్తి చేశారు.

ముస్లిం పత్రికావిలేఖరులతోను, చాలమంది లీగ్‌కౌన్సిల్ సభ్యులతోను, ముస్లిం విద్యార్థులతోను ఇష్టాగోష్టి జరిపారు. లీగు నొక ప్రజాస్వామ్య, ప్రజా సంస్థగా అభివృద్ధిచేయాలని వారు కనబరచిన ఆకాంక్షకు' నే నాశ్చర్యపడ్డాను. "స్వతంత్ర భారతదేశంలో ముస్లింప్రజల స్వాతంత్ర్యాన్ని స్థాపించుటకు" కృషి చేయాలని వారు వెల్లడించిన దీక్ష నన్నానంద పరిచింది.

లీగ్ కౌన్సిల్ సభ్యుడొకాయన నాతో ఇలా ఉన్నాడు :

"అనేక విషయాల్లో మీతో ఏకీభవిస్తాము. లీగు అభివృద్ధి కరమైన పంథాల ననుసరించాలనే మాకోరిక. కాని, అనుకొని ఏమిలాభం ? ముస్లిం ప్రజల లోకి పోయి పాటుపడనిదే; మాభావాలను వారి ఎదుటబెట్టి, వారినందరిని లీగులో సంఘటిత పరచందే, లీగు విధానాల్లో మార్పు నెలాతేగలం ?" ఈ దృక్పథమే లీగులో నానాటికి విస్తరిస్తుందనడానికి ఏలాంటి సందేహంలేదు.

# ముస్లిం జాతీయ వాదులపై చరిత్రవేసిన బాధ్యత

## కాంగ్రెసు ముస్లిం ప్రముఖుల సమావేశం

కాంగ్రెసు ముస్లింలను గురించి తలొకవిధంగా అనుకొంటున్నారు. కాంగ్రెసు-లీగు ఒడంబడికకు తీరని ఆటంకంగా ఉన్నది వీరే అని లీగు సభ్యు లంటారు. ఇక కాంగ్రెసులోని హిందువులా - "మీరు చాలా మంచివారేగాని ఏం ప్రయోజనం? ముస్లింలలో మీపలుకుబడి సన్నగిలిపోతుంది-" అన్నట్లు వారిని చూస్తున్నారు చాలమంది.

వీళ్ళిద్దరూ ఇలా అనుకోడంచూచి కాంగ్రెసు ముస్లింలు తబ్బిబ్బవుతున్నారు. బాధపడుతున్నారు. ఏంచేయాలి? ఎలాంటి త్యాగానికయినా తాము వెనుదీశారా? సామ్రాజ్యవాద సంకెళ్ళనుంచి తనదేశం విముక్తిపొంది. భారతీయులందరితోపాటు ముస్లిం సోదరులుకూడా నూతనజీవితాన్ని నిర్మించుకొని సుఖపడడంకోసం అష్ట కష్టాలకోర్చి తాము కృషిచేశారే!

ఇంతచేసినా నేడు తామున్న స్థితిఇది. దీనిలోంచి బయటికి మార్గంలేదా? నేటి రాజకీయ ప్రతిష్టంభనను తొలగించడానికి కాంగ్రెసు ముస్లింలు ఏమి చేయలేరా?

## నిష్కల్మష దేశభక్తులు

హాఫీజ్ మహమ్మద్ ఇబ్రహీం (యు. పి. లో లోగడ కాంగ్రెసుమంత్రి): అబ్దుల్లా బ్రెల్వి ('బాంబేక్రానికల్ సంపాదకులు): అబ్దుల్ ఖయాం (పెషావర్ కేంద్రశాసనసభలో కాంగ్రెసు ఎం. ఎల్.ఏ.): మౌలానా అహమద్ సయద్ (జమియత్-ఉల్-ఉలేమా-ఇ-హింద్ అక్షింగు అధ్యక్షుడు) మౌలానా మఫ్తి కిఫా యతుల్లా (జమయత్-ఉల్-ఉలేమా కార్యవర్గ సభ్యుడు): డాక్టర్ షౌకతుల్లా అన్సారీ (అజాద్ ముస్లింబోర్డు ప్రధాన కార్యదర్శి); మహమద్ అహమద్ కాజ్మి (అహరార్ నాయకుడు, యు. పి. నుంచి కేంద్రశాసనసభా సభ్యుడు) వీరందరు

నవంబరు మొదటిరోజుల్లో ఢిల్లీలో సమావేశమయారు. ప్రస్తుత రాజకీయ పరిస్థితులను గురించి ఆలోచించడానికి ఆసందర్భంలో నేను వారినందరిని కలుసుకున్నాను. మనదేశంలో ముస్లిం రాజకీయాలు తెలిసినవారికెవ్వరికి వీరు కొత్తగాదు. దేశంలో ముస్లిం జాతీయభావాలను తీర్చిదిద్దుతున్నవారిలో వీరు ప్రముఖులు.

మొదటి ముగ్గురు, వరుసగా యు. పి., బొంబాయి; సరిహద్దు రాష్ట్రాల కాంగ్రెసు ముస్లిం ప్రముఖులు. మౌలానా లిద్దరూ ఖిలాఫత్ ఉద్యమంనుంచి జాతీయోద్యమంలో వన్నెకెక్కిన యోధులు; మత గురువులుగ లక్షలాది ముస్లింల భక్తిని చూరగొన్నారు. అంతేగాదు. ఏమైనాసరే, సామ్రాజ్యవాదులకు తలవంచని ధీరులుగ గౌరవింపబడుతున్నారు. షౌకతుల్లా తన పెత్తండ్రి, సుప్రసిద్ధ దేశభక్తుడు అయిన డాక్టరు అన్సారీ సాంప్రదాయాన్ని నిలబెడుతున్నాడు. మన దేశంలోని ప్రముఖ విద్యాశాస్త్రవేత్తల్లో ఒకరి కొడుకు కాజ్మి. తండ్రికొడుకులు నిగ్గుతేరిన జాతీయవాదులు.

హఫీజ్ ఇబ్రహీం అంతకు కొద్దిరోజులక్రితమే విడుదలయివచ్చారు. వారే యీసమావేశాన్ని ఏర్పాటుచేశారు. కాంగ్రెసు - లీగు ఐక్యతను ఎలా సాధించడం? ఇప్పటి ప్రతిష్టంభనను తొలగిండానికి కాంగ్రెసు ముస్లింలు ఏవిధంగా తోడ్పడగలరు? అన్నవే సమావేశంలో చర్చించిన ప్రధానవిషయాలు. స్వయంనిర్ణయసూత్రం, పాకిస్థాన్‌ని గురించికూడా చర్చలు జరగడం సహజమే.

## మూలసూత్రం

ఈ సమావేశంలో ఎవ్వరేమిమాట్లాడినా ఒక మూలసూత్రం అందరిమాటల్లోనూ కనబడింది. హిందూ-ముస్లింఐక్యతకు ఈనాడున్న అవసరం ఇదివరకెన్నడూ లేదనీ, కాంగ్రెసు, లీగు ఐకమత్యం దేశానికెంతో క్షేమకరమనీ, అదే ప్రతిష్టంభనను తొలగించేమార్గమనీ అందరూ అంగీకరించారు ఈ సమావేశంలో తేలిన మరోముఖ్యవిషయం ఏమంటే - స్వతంత్రభారతదేశం ఒక సమ్మేళనంగా ఉండాలి. అయినప్పటికీ ఈ సమ్మేళనంలో చేరేప్రాంతాలకు విడిపోయేహక్కుతో సహా స్వయంనిర్ణయఅధికారం తప్పనిసరిగా ఉండాలి. ఇంచుమించు ఈ విషయాన్నే స్పష్టపరుస్తూ జమియత్ ఉల్-ఉలేమా 1942 ఫిబ్రవరిలో ఢిల్లీలోను, అజాద్ ముస్లింబోర్డు 1942 మార్చిలో లాహోరులోను తీర్మానాలు చేశాయి.

క్రిప్సురాయబారం విఫలమయినతరువాత కాంగ్రెసు వర్కింగుకమిటీ సమావేశమయి, ఏప్రాంతంలోని ప్రజలను కూడ నిర్బధంగా భారత సమ్మేళనంలో అట్టిపెట్టివేయం అని తీర్మానించింది. అంటే పైపైఖరికి చాలదగ్గరకు వచ్చిందన్నమాట అని ఈ సమావేశంలో అనుకొన్నారు.

## సమాధానం కుదురుతుందంటే -

అయితే లీగువిషయం ఏమిటి? ఇక్కడే వచ్చింది చిక్కంతా. కాంగ్రెసుతో ఒడంబడిక కుదుర్చుకోవాలనే పట్టుదల లీగుకి నిజంగా ఉందని వీరిలో ఎవ్వరికీ నమ్మకంలేదు. "పాకిస్థాన్ కోరికకు ఒప్పుకుంటే సమాధానం తప్పకుండా కుదురుతుందనే నమ్మకమే నాకుంటే ఆ కోరికకు కాంగ్రెసు ఒప్పుకొనేలా కృషి చేస్తాను. కాని. జిన్నా నిజంగా ఒడంబడిక కోరుతున్నాడని నేను నమ్మను. జైలు నుంచి గాంధీజీ ఉత్తరంరాస్తే, ఏంచేశాడో చూడండి. కాంగ్రెసుతో ఒడంబడిక కుదరకుండా ఉండడానికి జిన్నా ఏవో సాకులు వెతుకుతుంటాడు. కాంగ్రెసును ప్రతిఘటించడ వల్లనే లీగు నిలబడగలుగుతూంది. ఒడంబడిక కుదిరినట్లయితేముస్లింలీగుపలుకుబడి తగ్గిపోతుంది." వాని వారిలో ఒకరు నాతోఅన్నారు.

అంటే ఇతరకాంగ్రెసువాదులవలె కాంగ్రెసు ముస్లింలకు కూడా లీగంటే గాఢమైన అనుమానా లున్నాయన్నమాట.

"స్వయంనిర్ణయకోరికను ఆమోదిస్తున్నామని మీరు స్పష్టంగా ప్రకటించి, కాంగ్రెసువారిచేతకూడా ఆమోదింపజేస్తే - లీగు దేశభక్తులకు కాంగ్రెసంటే ఉన్న అనుమానాలుపోతాయి. ఐక్యతనుకోరుతూన్న లీగువర్గాలు బలపడతాయి. జాతీయ నాయకుల విడుదలకోసం లీగుకూడా కృషిచేసేలా ఒత్తిడి తేవడానికి వాటికి అవకాశం చిక్కుతుంది అంటే ప్రతిష్టంభనను తొలగించడానికి కాంగ్రెసుకు లీగు చేయూతగ ఉండే అవకాశం దొరుకుతుందన్నమాట. ఈనాడు కాంగ్రెసు ముస్లింలపైని చరిత్రపెట్టిన బాధ్యత యిది." అని నేనన్నాను.

తరువాత ఈ విషయం ఒక లీగ్ ప్రముఖునితో మాట్లాడాను. అతనాశ్చర్యపోయాడు. పాకిస్థాన్ సూత్రం అంగీకరించినా, లీగ్ ఒడంబడికకు రాదనుకునే వారున్నారా అన్నాడు. దీనినిబట్టి చూస్తే పాకిస్థాన్ గురించికాదు అభిప్రాయభేదాలుండడం - పరస్పర విశ్వాసం లేకపోవడంవల్లనే ఐక్యత కుదరకుంటుందని ఆయనకు స్పష్టపరిచాను.

ఢిల్లీ సమావేశంలో తేలిన ముఖ్యవిషయం కూడా ఇదే. • ఆ ప్రముఖులు ఐక్యతయొక్క అవసరాన్ని గుర్తించారు. ఈ ఐక్యతకు పునాది స్వయంనిర్ణయ సూత్రాన్ని అంగీకరించడమే అన్న విషయాన్నికూడా గుర్తించారు. కాని దానితో బాటు లీగ్ అంటే విపరీతమైన అనుమానాలు.

"ఏంచేస్తే ప్రయోజనముంది? మనం ఎంతచెప్పినా లీగువారు వినరు. పైగా మనం జాతి పక్షపాతం చూపుతున్నామని కాంగ్రెసుసోదరులు అనుమానించవచ్చు. కాంగ్రెసునాయకులు జైళ్ళలో ఉన్నారు. మనం ఎంతగింజుకొన్నా వారిని బయటికి

శేలేము. వారు వస్తేనేగాని ఏదీ జరగదు. అంతవరకు కాచుకొని ఉందాం—" ఇలాంటి నిస్పృహకు, నిరాశకు ఈ అనుమానాలే కారణం. కాని అనేకులలో ఇలాంటి భావాలు లేవు.

హాఫీజ్ మహమద్ యిబ్రహీంగారు హిందూ-ముస్లిం ఐక్యతతోనం కాంగ్రెసు ముస్లింల వందరినీ సంఘటితపరచడానికి తప్పకుండా కృషిచేస్తారు. దానితో గొప్ప సంచలనం కలుగకమానదు. జైళ్ళలోని ప్రముఖు లేమనుకొం టున్నారని అడిగితే, వారిలా అన్నారు.

"జైళ్ళలో తనతోడి కాంగ్రెసు దేశభక్తులందరూ బయటికివచ్చి, ప్రతిష్ఠంభ నను అంతమొందించడానికి తహతహ లాడుతున్నారు. ఈ ఆశయంతో బయట నున్న మనం చేసేకృషిని వారు తప్పకుండా ఆమోదించి, బలపరుస్తారు."

(నవంబరు 1943)

# కరాచీసమావేశం

( 1943 డిసెంబరు )

ఆరోజున కరాచీనగరవీధులన్నీ చక్కగా అలంకరింపబడ్డాయి. దేశంలో వివిధప్రాంతాలనుండి వచ్చిన 1500 మంది ముస్లింనేషనల్‌గార్డులు (వాలంటీర్లు) తోను, ముస్లింవిద్యార్థి దళాలతోను పెద్దవూరేగింపు బయలుదేరింది. వారి వెనుక ఒక నూరు మోటారుకార్లలో ముస్లింలీగునాయకులు, మంత్రులున్నారు. ఇరు ప్రక్కల సింధు గుర్రాల ఫౌజులు నడుస్తూంటే మధ్యను ఒంటెచేలాగబడే రథం మీద జిన్నా కూర్చున్నాడు. వూరేగింపు నగరవీధులన్నీ తిరిగి రావడానికి గంటకు పైగా పట్టింది. 36 సంవత్సరాల వెనుక (1907) ఈ కరాచీ నగరంలోనే జరిగిన ప్రథమ ముస్లింలీగు మహాసభకు వచ్చిన కొద్దిమందిని, ఇప్పుడు వచ్చిన వారిని పోల్చి చూస్తే ముస్లింలీగు ఎంత బలపడిందీ బోధపడుతుంది.

ముస్లింలీగుజెండాను ఎగురవేస్తూ జిన్నా ఇలా అన్నాడు. "ఈవూరేగింపు ముస్లిముల ఐక్యతకు బలానికి చిహ్నం."

ఒక సంస్థగాచూస్తే ముస్లింలీగ్‌లో ఒడుదుడుకులుండవచ్చు. కాని ఈనాడు అనేకవేల భారతముస్లిముల కోర్కెలను, ఆశలను అది ప్రతిబింబిస్తోందనడానికి సందేహంలేదు. ఒక్కొక్క సంవత్సరమే గడుస్తున్నకొద్దీ ముస్లిం జనసామాన్యంలో వారి నాయకుడైన జిన్నా యెడల గౌరవం విశ్వాసం ఎక్కువ అవుతూనే వున్నాయి.

ఆ వూరేగింపులో వారి ముఖ్యనినాదాలు మూడు. అవి, "పాకిస్థాన్ జిందాబాద్", "ముస్లింలీగ్ జిందాబాద్" "జిన్నాకుజై". అనేవి. ఈ నినాదాలు దేనిని తెలియజేస్తున్నాయి? భారతముస్లిములు తమ భూభాగాల్లో స్వతంత్రంగా జీవనించడానికి పాకిస్థాన్ కావాలని కోరుతున్నారు. రెండోది ముస్లింలీగు వారి జాతీయ సంస్థ. మూడోది లీగునాయకుడు, లీగునిర్మాత, అయిన జిన్నా తమ్మందరిని స్వాతంత్ర్యపోరాటంలో విజయవంతంగా ముందుకు నడుపుతాడని వారి విశ్వాసం.

## అధ్యక్షోపన్యాసం

జిన్నా అధ్యక్షోపన్యాసాన్ని ప్రతినిధులంతా అత్యంత శ్రద్ధతో విన్నారు. భారత ప్రజలకు రాజకీయాధికారం లేకుండాచేయడానికి బ్రిటిషు నిరంకుశాధికారులు

అవలంబించే కుటిలపద్ధతులను జిన్నా ఖండించినప్పుడు అన్నిటికంటే ఎక్కువ జయజయధ్వానాలు చేయబడ్డాయి. ముస్లింలీగ్ ఒక్క ముస్లిముల స్వాతంత్ర్యానికే (పాకిస్థాన్‌కు) కాకుండా హిందువులయొక్క, భారత ప్రజలందరియొక్క సంపూర్ణ స్వాతంత్ర్యంకోసం పోరాడుతూందని జిన్నా స్పష్టీకరించాడు.

జిన్నా ఇలా అన్నాడు.

"మనం బ్రిటిషు పరిపాలన వుండాలని అంటామనడం సర్వకల్ల. ముస్లిం లీగ్ భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని కోరడంలేదని అంటే అది ముస్లిం లీగుకు వ్యతిరేకంగా చేసే విషప్రచారం; దుర్బుద్ధితో చేసేది తప్ప మరోటికాదు"

ముస్లింలీగుతో ఒడంబడిక చేసుకొనకుండా వుండడంవల్ల కాంగ్రెసే మన స్వాతంత్ర్యపోరాటాన్ని కుంటుపరుస్తోందని జిన్నా వాదిస్తున్నాడు. దీనినిబట్టి, కాంగ్రెసు-లీగులు ఐక్యమైతే ఈ ఐక్యశక్తితో బ్రిటిషు సామ్రాజ్యవాదులను, భారతప్రజలతో రాజీకి వచ్చేటట్లు లొంగదీయవచ్చునని జిన్నా నమ్ముతున్నాడని స్పష్టమౌతోంది. కాని, కాంగ్రెసునుగూర్చి ఆయనచేసే రిమార్కులనుచూస్తే, ఈ ఐక్యతకు ఇప్పుడు అవకాశంలేదని జిన్నా భావిస్తున్నాడు.

ఆయన దృష్టిలో కాంగ్రెసువారి దృక్పథంలో ఏమీ మార్పుకనబడటంలేదు. జైలులో లేకుండా బైటనున్న కాంగ్రెసు వాదులలోకూడ మారేచిహ్నాలేమీ గోచరించడంలేదు. ఈ నిర్ణయానికి వచ్చి, జిన్నా తన అనుచరులందరికి "పాకిస్థాన్ సంపాదించడంకోసం స్వశక్తిమీదనే ఆధారపడండి" అని సలహాయిస్తున్నాడు.

అధ్యక్షోపన్యాసంలో జిన్నా ఇచ్చిన ఈసలహానుసరించే మరునాడు మహా సభలో చౌదరీ ఖాలీ కుజామన్ "కమిటీ అఫ్ యాక్షన్"ను అర్గనైజు చేయాలని తీర్మానం ప్రతిపాదించాడు. సరిహద్దు ప్రధాని సర్దార్ ఔరంగజేబుఖాన్, సరిహద్దు రాష్ట్రమంత్రులలో ఒకడైన నాష్టర్, పంజాబు శాసనసభ్యుడైన షేక్ కరామత్ గార్లు ఈ తీర్మానాన్ని బలపర్చారు. అందరి ఉపన్యాసాలలోనుకూడా రెండుధోరణులు స్పష్టంగా కనబడ్డాయి. మొదటిది పాకిస్థాన్ ఎందుకు కావాలో వాదించబడింది. చౌదరీ సాహెబ్ ఇలా అన్నాడు: "ముస్లిములు పాకిస్థాన్ కావాలని కోరుతున్నారంటే హిందూ మైనారిటీలపై పెత్తనం చెలాయించడానికి కాదు, వారు శాశ్వతంగా హిందూ పెత్తనంక్రిందనే వుండి పోకుండా విముక్తి చెందుదామనే." ఔరంగజేబుఖాన్ ఇలా అన్నాడు:" ముస్లిములు తామున్న ఆరురాష్ట్రాలకు స్వాతంత్ర్యం కావాలని కోరుతున్నారు. అల్లాగే హిందువులు మిగిలిన ఆరురాష్ట్రాలకు స్వాతంత్ర్యం పొందవచ్చు. పాకిస్థాన్‌లో వుండె మైనారిటీలపట్ల న్యాయంగా వుండడమే గాక కావలసినంత ఉదారంగాకూడ వుంటాము."

ఉపన్యాసాలలో కనబడిన రెండవధోరణి ఇది. "పాకిస్థాన్ సంపాదించ డానికి సాగించబోయే పోరాటంలో" బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిర్మాణ యుక్తంగా బలపడవలసినదని ముస్లిం ప్రజలను ఉత్సాహ పరుస్తున్నారు. పరిహద్దురాష్ట్ర మంత్రియైన నస్తార్‌కూడ ఈ ధోరణినే మరింత స్పష్టపరిచాడు. అతనిలా అన్నాడు. "మన ప్రధానశత్రువు బ్రిటిషు ప్రభుత్వమేగాని హిందువులు కాదు."

## నిరాశ, నిరుత్సాహం :

1943 ఏప్రిల్‌లో ఢిల్లీలో జరిగిన లీగ్ మహాసభలోవలెనే ఇప్పుడుకూడ, ఐక్యతరాదనే నిరుత్సాహం వారిలోవుంది. కాంగ్రెసుతో ఐక్యత కుదరదని, అందు చేత తద్వారా స్వయంనిర్ణయహక్కు, జాతీయప్రభుత్వం ఇవి సాధించడం ఇంక సాధ్యంకాదు. కనుక పాకిస్థాన్‌కోసం ప్రాణాల నర్పించడానికైనా సిద్ధంకండని ముస్లింప్రజలను వారు హెచ్చరిస్తున్నారు. చాలమంది ముస్లిం నాయకుల అభి ప్రాయంలో, ఢిల్లీ, కరాచీ మహాసభల మధ్యకాలంలో జరిగిన మార్పు ఏమీలేదని, ముస్లిములపట్ల కాంగ్రెసు - బ్రిటిషు ప్రభుత్వము రెండూ కూడా తమ వైఖరిని ఏమీ మార్చుకోదల్చుకోలేదని వారి వుద్దేశం.

అందుచేత వారిలో నిస్పృహ జనించింది. అన్నిస్పృహతో ఏదో ఒకటి చేసేద్దామనే ఆవేశం వారి నావహించింది. క్రిప్సు రాయబారాలు విఫలమైన తరువాత, 1942 ఆగస్టు ఎ. ఐ. సి. సి. సమావేశం జరిగే మధ్యకాలంలో కాంగ్రెసులో ఎట్టి స్థితి ఏర్పడిందో సరిగ్గా అటువంటి స్థితే ముస్లింలీగులోకూడ ఏర్పడింది.

అక్కడకూడ ముస్లింలీగుతో ఐక్యతకోసం ముందుకు పోవాలనే మార్గం విడనాడబడింది. ఇంకోప్రక్క బ్రిటిషు ప్రభుత్వాన్ని చూద్దామా అంటే బిర్రబిగుసు కుని కూర్చుంది. అందుచేత నిస్పృహ, ఆ నిస్పృహతో ఏదో ఒకటి తెంపుచేసే యాలనే ఆవేశం ఉద్భవించి చివరికి సామ్రాజ్యవాదుల చేతులలో పడిపోయారు. జపాను ఫాసిస్టులదాడినుండి దేశాన్ని రక్షించుకోవాలనే దేశరక్షణకూడ వదలి పెట్ట బడింది. అన్నిటిలోకి పెద్దదైన మనజాతీయసంస్థ, కాంగ్రెసు నిస్తబ్ధతలో పడింది. మనప్రజలు నిస్సహాయులై, కరువుకు, అంటువ్యాధులకు గురికావొచ్చారు.

జిన్నా అధ్యక్షోపన్యాసంయెడల, ఇతర నాయకుల ఉపన్యాసాలపట్ల ప్రతి నిధుల అభిప్రాయాలేమిటో తెలుసుకోవాలని ఆతృతతో ప్రతినిధుల క్యాంపుకు వెళ్ళాను. ఒక రాష్ట్రముస్లింలీగ్ నాయకులలో ఒకాయన ఇలా అన్నాడు. "ఇప్పుడు మేము ఒక పోరాటం సాగించడం అసంభవం. కాంగ్రెసువంటి పెద్ద

సంస్థయే అణచివేయబడినప్పుడు లీగు విజయవంతమౌతుందనడానికి అవకాశం లేదు."

అయితే ఇంక ఇప్పుడు లీగ్ యేర్పరచే కమిటీ ఆఫ్ యాక్షన్ ఏమిచేయబోతుందని ఆశిస్తున్నావని నేనాయనను అడిగాను. ఆయనకేమీ తోచలేదు. జిన్నా తన అధ్యక్షోపన్యాసంలో ముస్లింలీగ్ శాశ్వతమైన ఒక సెక్రిటేరియటు కమిటీని ఏర్పాటుచేయాలని సూచించాడు. ఈ కమిటీ ముస్లింలీగును ఆర్గనైజు చేయడం, రాజకీయ, ఆర్థిక సాంఘిక విషయాలలో ముస్లిముల అభివృద్ధికోసం జరిగే కార్యక్రమాన్ని సమీకరించడానికి కృషిచేస్తుంది. ఇదైతే బాగానేవుంది. కాని నాయకుల ఉపన్యాసాలలో చెప్పిన "యాక్షన్" కి దీనికి చాలా వ్యత్యాసంవుంది.

ఈ కమిటీ ఆఫ్ యాక్షన్, రాష్ట్రాలలో లీగు నిర్మాణానికి అంటే రెగ్యులరుగా సభ్యత్వాన్ని చేర్పించడం, ప్రజాస్వామ్య పద్ధతులపై పనిచేసేటట్లు చేయడం. ముస్లిం ప్రజాసామాన్యానికి బాధకరంగా వుండేటట్లుగా స్వార్ధభూస్వాములయొక్క వడ్డీవ్యాపారస్థులయొక్క అన్యాయాలను అరికట్టడానికి కృషిచేయడం ద్వారా లీగు పాలసీని అమలుజరపడం మొదలైన పనులుచేయడానికి సహాయం చేయవచ్చుననే భావమే చాలమంది ప్రతినిధులలో లేదు. ఆ కమిటీ ఆఫ్ యాక్షన్ యొక్క పనులేమిటి అనేవిషయం పై వారికి ఒక స్పష్టమైన అభిప్రాయంలేదు.

ముస్లింలీగు పార్లమెంటరీబోర్డును ఏర్పాటు చేయడం విషయంలోకూడ పంజాబు, బెంగాల్ ప్రతినిధులలో నాకిటువంటి పొరపాటు దృక్పధమే కనబడింది. ఈ పార్లమెంటరీబోర్డును ఏర్పరిస్తే, రాష్ట్రాలలో మంత్రులు ఇంక రాష్ట్రముస్లింలీగులను, లెక్కచేయకుండా త్రోసిపుచ్చే పరిస్థితు లేర్పడుతాయని వారిభయం. దానికి తగినట్లుగానే నజీముద్దీన్, బెంగాల్ అసెంబ్లీపార్టీ బెంగాల్ రాష్ట్ర ముస్లిం లీగు నిర్ణయించే పాలసీనే అంగీకరించాలని ఎక్కడా లేదు అని ప్రకటించాడు. అదీగాక, బెంగాల్‌రాష్ట్ర ముస్లింలీగు రిలీఫ్‌కమిటీ ఏర్పడకుండా మంత్రివర్గమంతా పాడుచేసింది. కాని ఈరెండు విషయాలపైనకూడా రాష్ట్రముస్లింలీగు మంత్రివర్గముతా ఆటలను సాగనివ్వలేదు.

కాంగ్రెసు మంత్రివర్గాల రోజుల్లోకూడా ఇటువంటి పరిస్థితులే వచ్చాయి. మంత్రివర్గాలలోనున్న కొందరు స్వలాభాపేక్ష పరులు ఇలాగే రాష్ట్రసంఘాలకు మంత్రులపై ఏమీ అధికారం వుండకూడదన్నట్లుగా వాటిని తప్పించి పైనాయకుల అండను చేరి తమయిష్టంవచ్చినట్లు సాగిద్దామనుకున్నారు.

## ప్రజాస్వామ్యలక్షణాలు

మహాసభలో జడ్. ఎ. లారీ ఒక తీర్మానాన్ని ప్రతిపాదించాడు. ఆ తీర్మానంలో పాకిస్థాన్‌గా ఏర్పడాలనే ప్రాంతాలలోని ప్రజల ఆర్థిక, సాంఘిక అభివృద్ధి

కోసం. పరిశ్రమలను అభివృద్ధి చేయడంకోసం ఒక పంచవర్షప్రణాళికను తయారు చేయడానికి ఒక కమిటీని నియమించవలెనని వుంది. ఈతీర్మానం ఉద్దేశం మంత్రి వర్గాలకు ఒక స్పష్టమైన కార్యక్రమం ఇవ్వడమే.

లారీ ఇంకా ఇలా కోరాడు. లీగు మంత్రివర్గాలు తమతమ రాష్ట్రాలలో నిర్బంధ విద్యావిధానం అమలుజరపాలని, ప్రజలను పీడించుకు తినడానికి బ్రిటిషు వారిచే సృష్టించబడిన భూస్వామ్య విధానాన్ని రద్దుగావించి రైతులకు విముక్తి కలిగించాలని కోరాడు. కార్మికుల పరిస్థితి బాగుపడడానికి, పరిశ్రమలు వ్యక్తుల చేతులలో నుండకుండా ప్రభుత్వమే నడిపేవిధానం అవలంబించాలనికూడా కోరాడు.

బెంగాలు మంత్రి తామిజుద్దీన్ సోవియట్‌యూనియన్‌లో పరిశ్రమలు ప్రజా యత్తం గావింపబడినందుకు సోవియట్‌ను అభినందించాడు.

లాహోరునుండి వచ్చిన హమీద్ నైజామి లీగులోవున్న నవాబుల్ని, ఖాన్ బహదూరులను ఖండించాడు. ముస్లింలీగు ముస్లిం జనసామాన్యంయొక్క హక్కులకొరకు పోరాడాలని, తద్వారా నిజమైన ప్రజాసంస్థగా తయారుకావాలని హెచ్చరించాడు.

హుస్సేన్ ఇమామ్ ప్రవేశపెట్టిన తీర్మానంలో అన్ని జీవితావసర వస్తువుల ధరలు కంట్రోలుచేయాలని, రేషనింగు పెట్టాలని కోరబడింది. ఈవిధంగా ఇతర జీవితావసర వస్తువుల ధరలుకూడా కంట్రోలుచేయాలనే నినాదం లేవదీయడం ద్వారా, పంజాబు, సింధు రాష్ట్రాలలోని వ్యాపారస్థుల ఉద్దేశం తక్షణమే ఆహార పదార్థాల ధరలు కంట్రోలుచేసి రేషనింగు పెట్టాలనే కోరికను మరుగుపరచాలని. ఏది ఏమైనప్పటికీ లీగు మహాసభకు వచ్చిన ప్రతినిధులలో అత్యధికసంఖ్యాకులు వెంటనే రేషనింగుకావాలని, ధరల కంట్రోలు కావాలని కోరుతున్నమాట నిజం. పంజాబు, సింధు మంత్రివర్గాలు అవలంబించుతున్న రాజకీయాలను వారంతా అసహ్యించుకుంటారు. వ్యక్తిగత సంభాషణలలో, ముఖ్యులైన బెంగాల్ ప్రతి నిధులు, తమ రాష్ట్రంలో ఈ లాభసాటి వ్యాపారస్థులు మంత్రివర్గంపై తెచ్చే ఒత్తిడిని తీవ్రంగా విమర్శించారు. బెంగాల్ కరువుసమస్య ఈమహాసభ చర్చలలో పొందవలసినంత ప్రాముఖ్యతను పొందలేదని వారికి కొంత అసంతృప్తికూడా కల్గింది. అయినప్పటికీ లీగు రిలీఫ్‌కమిటీ వర్కర్లుమాత్రం వూరుకోలేదు. ప్రతి నిధులలో ముఖ్యులైన లీగు నాయకులందరిని కలుసుకున్నారు. వారి కమిటీకి రు. 75000 లు చందు వసూలుచేశారు.

లీగుమహాసభ జరిగిన ఈమూడురోజులూకూడా నేనుప్రతినిధుల నందరిని కలుసుకుంటూ వారితో చర్చలుసాగిస్తూనేవున్నాను. వారిలో చాలామందిలో, ముస్లింలీగును ప్రజాస్వామ్యపద్ధతులపై పనిచేయించాలనీ, రియాక్షనరీల యొక్క

స్వలాభాపేక్షాపరులయొక్క పలుకుబడి లేకుండా చేయాలనీ, లీగునుప్రజాసంస్థగా చేయాలని వుంది. లీగు మంత్రివర్గాలు ప్రజామన్నన బడసిన మంత్రివర్గాలుగా వుండాలని వారిఆశయం. పౌరసత్వహక్కులను ఇంకా ఎక్కువచేయాలని వారి కోరిక.

కానైతే లీగు ఇంకా ఎటూ నిర్ణయించుకోలేని స్థితిలోవుంది. ఎంతవరకు ప్రజాస్వామ్య విధానాన్ని అవలంబించుతుందో అంత ఎక్కువగాను లీగు పలుకుబడి హెచ్చుతుంది. నిర్మాణయుక్తంగా బలపడుతుంది. ఇతర సోదర దేశభక్త పార్టీలతో ఐక్యత పెంపొందుతుంది. ఒకవేళ కరాచీ సమావేశంలో ప్రదర్శితమైన ఈ ప్రజాస్వామ్యధోరణి పైకి రాకుండా సరిహద్దురాష్ట్రం, పంజాబ్, సింధు, బెంగాల్ మంత్రివర్గాల వెనుకనున్న స్వలాభాపేక్షపరుల పలుకుబడిదే పైచేయి అయితే లీగు మరొక ప్రమాదాన్ని ఎదుర్కొనవలసి వస్తుంది. అప్పుడు లీగు బలహీనపడిపోతుంది. ఇటువంటి పరిస్థితి సంభవించాలని ఏ భారతీయ దేశభక్తుడు కోరడు. ఎందుచేతనంటే ముస్లింలీగు పలుకుబడి ముస్లిం ప్రజాసామాన్యాన్ని అభివృద్ధికరమార్గంలో, ప్రజాస్వామ్య పద్ధతులతో నడపగలిగినప్పుడే లక్షలకొలది ముస్లిం సోదరుల విముక్తివుంది. అప్పుడే కాంగ్రెసు లీగు ఐక్యతకుకూడ ఎక్కువ అవకాశంవుంది.

# అనుబంధం

## I

## లీగు ఆశయాలు

1941 ఏప్రిల్‌లో మద్రాసులో జరిగిన అఖిలభారత ముస్లింలీగ్ మహాసభలో ఆమోదింపబడి, లీగు నిబంధనావళిలో సెక్షన్ 2 (ఎ)లో చేర్చబడిన"లీగుఆశయాలు" అనుభాగం.

i. భౌగోళికంగా ఒకదానినొకటి అనుకొనియున్న ప్రదేశాలను కలిపి ఒక రీజియన్‌గా ఏర్పాటుచేయడానికి, అందుకు అవసరమైతే ఇదివరకున్న సరిహద్దులను మార్చి క్రొత్తహద్దులను ఏర్పాటు చేయడానికి అవకాశం యివ్వాలి. ముస్లిములు అధికసంఖ్యాకులుగానున్న తూర్పు.వాయువ్యప్రాంతాలు అన్నీ కలిపి ముస్లిముల స్వతంత్రరాష్ట్రంగా ఏర్పాటుచేయాలి. ఈ రాష్ట్రంలో వుండే యూనిట్లు స్వపరిపాలనాధికారం గల స్వతంత్ర యూనిట్లుగా వుండాలి.

ii. పైన చెప్పబడిన భూభాగాలలోని మైనారిటీలకు,వారి అర్థిక. రాజకీయ. మత, వైజ్ఞానికహక్కులను, పరిపాలనహక్కులు. ఇతరహక్కులను కాపాడడానికి కావలసిన మాండేటరీ రక్షణలు ఇవ్వబతాయి. దీనికి కాన్‌స్టిట్యూషన్‌లో అవకాశం ఇవ్వబడుతుంది.

iii. ముస్లిములు మైనారిటీలుగావున్న ఇతరప్రాంతాలలోకూడా ఈవిధంగానే ముస్లిముల అర్థిక, రాజకీయ, మత, వైజ్ఞానిక, పరిపాలనా హక్కులను కాపాడడానికి అందుకు వారితో సంప్రదించి చేయడానికి కావలసిన అవకాశాన్ని ఆయా కాన్‌స్టిట్యూషన్లలో ఇవ్వాలి.

## II

## పాకిస్థాన్ తీర్మానం

1940 మార్చి నెలలో లాహోరులో జరిగిన అఖిలభారత ముస్లింలీగు మహాసభలో ఆమోదింపబడిన తీర్మానం.

ఈ క్రింది ప్రధానసూత్రాలపై నిర్ణయించబడిన రాజ్యాంగ విధానం అయితే తప్ప ఈదేశంలో ఆచరణయోగ్యంకాదు. ఆసూత్రాలు ఏవంటే. భౌగోళికంగా ఒక

దానినొకటి అనుకొనియున్న ప్రదేశాలను కలిపి ఒక రీజియన్(పెద్ద భూభాగంగా) ఏర్పాటుచేయాలి. ఇందుకు అవసరమైతే ఇదివరకున్న సరిహద్దులనుమార్చి క్రొత్త హద్దులను ఏర్పాటుచేయడానికి అవకాశం ఇవ్వాలి. మనదేశంలో ముస్లిములు అధిక సంఖ్యాకులుగానున్న తూర్పు, వాయువ్యప్రాంతాలన్నీకలిపి ఒక స్వతంత్రరాష్ట్రంగా ఏర్పాటుచేయాలి. ఈ స్వతంత్రరాష్ట్రంలోవుండే యూనిట్లు(చిన్నభూభాగాలు) స్వపరిపాలనాధికారం గల స్వతంత్రయూనిట్లుగా వుండాలి.

ఈ యూనిట్లలోని మైనారిటీలకు వారివారి ఆర్థిక రాజకీయ, మత, వైజ్ఞానిక హక్కులను, పరిపాలన హక్కులను, ఇతర హక్కులను కాపాడడానికి స్పష్టమైన మాండేటరీ రక్షణలు ఇవ్వాలి. ముస్లిములు మైనారిటీగావున్న ఇతర ప్రాంతాలలోకూడ ఈవిధంగానే ముస్లిముల ఆర్థిక, రాజకీయ, మత, వైజ్ఞానిక, పరిపాలనాది హక్కులను కాపాడడానికి అందుకు వారితో సంప్రదించి చేయడానికి కావలసిన అవకాశాన్ని ఆయా కాన్స్టిట్యూషన్లలో ఇవ్వాలి.

ఈ ప్రధానసూత్రాల ననుసరించి ఆయా రీజియన్ల డిఫెన్సు, విదేశవ్యవహారాలు, రాకపోకలు, కస్టమ్సు మొదలైన అధికారాల విషయమై వారి తుదినిర్ణయానికి అవకాశమిస్తూ ఒక కాన్స్టిట్యూషను స్కీమును తయారుచేయడానికి వర్కింగు కమిటీకి అధికారం ఈయబడింది.

# III

## లక్నో "సంపూర్ణ స్వాతంత్ర్య" తీర్మానం

1937 లో లక్నోలో జరిగిన అఖిలభారత ముస్లింలీగు మహాసభలో ఆమోదింపబడిన తీర్మానం.

స్వతంత్ర ప్రజాస్వామ్య రాష్ట్రాలతోకూడిన సంపూర్ణ స్వతంత్ర ఫెడరేషన్‌ను నిర్మించడమే అఖిలభారత ముస్లింలీగుయొక్క ఆశయం. ఆ కాన్స్టిట్యూషనులో ముస్లిములహక్కులు, ఇతరమైనారిటీలహక్కులు సమగ్రంగానూ, చక్కగానూ రక్షించబడతాయి.

# IV

## జీవితావసరవస్తువులపై తీర్మానం

1943 ఏప్రిల్‌లో ఢిల్లీలో జరిగిన అఖిలభారత ముస్లింలీగు మహాసభలో ఆమోదించబడిన తీర్మానం.

యుద్ధ సమయంలో ముఖ్యంగా సరఫరామార్గాలు, సరకులు ప్రభుత్వ ఆధీనంలో వుంటాయి. గనుక ప్రజలకు జీవితావసర వస్తువులను సప్లయిచేసే బాధ్యత ప్రభుత్వమే వహించవలసి వుంటుంది. నేడు ప్రభుత్వం నిర్ణయించిన ధరలకు-ప్రజలు కొనుక్కోవలసివస్తూన్న ధరలకూ ఎక్కడా సంబంధమే వుండటంలేదు. ఇది అర్థశాస్త్ర సూత్రాలకు వ్యతిరేకం. ఈ పద్ధతి దొంగ మార్కెట్లకు, తప్పుడు పనులకు, ప్రజలను దోచుకోడానికి తోడ్పడుతోంది. ప్రభుత్వం నిర్ణయించిన కంట్రోలువిధానం, దానిని పెట్టుబడిదారులు, వర్తకులు ఆచరణలోపెట్టుతూన్న పద్ధతిచూస్తే ప్రభుత్వం ఆశయం పూర్తిగా భగ్నమైందని చెప్పాలి. అంతేకాదు, పైపెచ్చు దొంగనిల్వలకు, అపరిమిత లాభాలకు అమ్మే దొంగమార్కెట్లకు ఈ పద్ధతి ప్రోత్సాహమిస్తోంది. ప్రజలకు — ముఖ్యంగా బీద తరగతి ప్రజలకు దారిద్ర్యాన్ని మరింత ఎక్కువచేస్తోంది. అందుచేత ముస్లింలీగు ప్రభుత్వాన్ని ఈ క్రింది విధంగా కోరుతోంది. ప్రభుత్వం, జీవితావసరవస్తుల విషయంలో ఒక పాలసీని అవలంబించడానికి పెట్టుబడిదారులను, వ్యాపారస్థులను, ఉద్యోగస్థులను ఎలా సంప్రదించుతోందో అలాగే ప్రజాప్రతినిధులనుకూడా సంప్రదించాలి. దానితో పాటు (1) జీవితావసరవస్తువులన్నీ వ్యాపారస్థుల దొంగనిల్వలకు లోనుగాకుండా ప్రజలందరికి అందేలాగ పంపకం జరిగేటట్లు చూడాలి. (2) వాటిని ఉత్పత్తిచేసిన వారికి తగినంత లాభంవుండేలాగ చూచి సరసమైన ధరలకు అమ్మేటట్లు చేయాలి. (3) ఆ సరకులను ప్రజలకు అందజేసేవారు అన్ని తరగతుల ప్రజలనుండి నియోగింపబడాలి. (4) పట్టణాల్లో అన్ని భూభాగాలలోను విరివిగా చిల్లరగా సరుకునమ్మే దుకాణాలు ఏర్పాటు చేయాలి.

ఈ ఆహార ప్లానును నిర్ణయించడంలోను, అమలు జరపడంలోను, ప్రతి సందర్భంలోకూడా ప్రజాప్రతినిధులను-ముఖ్యంగా ముస్లింలీగు ప్రతినిధులను సంప్రదించుతూ వారితోకలిసి సహకారంతో పనిచేయాలనికూడా ప్రభుత్వాన్ని కోరుతున్నాము.

## V

## ఆహారసమస్యపై బెంగాల్‌రాష్ట్ర ముస్లింలీగ్ తీర్మానం

1943 నవంబరు 7వ తేదీని కలకత్తాలో సమావేశమైన బెంగాల్‌రాష్ట్ర ముస్లింలీగ్ కౌన్సిలు గావించిన ముఖ్యతీర్మానం.

అఖిలభారత ముస్లింలీగు సూచించిన సలహాలను ఆచరణలో పెట్టడానికి బెంగాల్‌రాష్ట్ర ముస్లింలీగ్ కౌన్సిలు ఈవిధంగా తీర్మానించింది.

1. బెంగాలు రాష్ట్రమంతటా దొంగనిల్వలు చేసేవారికి, విపరీత లాభాలకు అమ్మేవారికి వ్యతిరేకంగా ప్రచారం గావించడానికి అధికారంఇస్తూ అందరికి ప్రాతి నిధ్యంగల ఒక అనధికార కమిటీ నియమించబడాలి.

2. ఆఫీషియల్ రిలీఫ్‌కమిటీలను స్థానిక ఆహారకమిటీలతో కలపాలి.

3. ఈ ఆహారకమిటీలద్వారా ఆహార పదార్థాలను ప్రజలకు అందజేయాలి.

4. అమన్‌పంట ప్రజలకు న్యాయంగా అందుబాటులో వుండేలాగ చేయ డానికి దానిని కొనాలి.

5. ఇతర జీవితావసర వస్తువులను సరిగా కంట్రోలు చేయాలి.

6. మునిసిపాలిటీలు, యూనియన్‌బోర్డులు వున్నచోట్ల ప్రభుత్వం షాపు లను పెట్టాలి.

7. దొంగమార్కెట్టులో సరుకులు అమ్మేవారిపైన, దొంగ నిల్వలు చేసే వారిపైన కఠినమైనచర్య తీసుకోవాలి.

# VI

## కరాచీలో జరిగిన అఖిలభారత ముస్లింలీగ్ మహాసభ సందర్భంలో, భారత కమ్యూనిస్టుపార్టీ విజ్ఞప్తి

బ్రహ్మాండమైన కరువు సంక్షోభం దేశాన్నంతటినీ కంపించివేసిన ఈసమ యంలో మీ మహాసంస్థ (లీగ్) యొక్క సాంవత్సరిక సమావేశం జరుగుతోంది. దేశంయొక్క ఆర్థికజీవనంఅంతా కూలి అంతరించే పరిస్థితి మన నెత్తిపైకి ఎక్కికూర్చున్న సమయంలో ఈ సమావేశం జరుగుతోంది.

మనదేశానికి, స్వతంత్ర ముస్లింజాతుల, తూర్పురక్షణకుద్యమైన బెంగాల్, ఆకలికి, మృత్యువుకూ గురియై నిస్సహాయంగా పడివుంది.

నిరంకుశ ప్రభుత్వంయొక్క చేతగానితనం, తిండిదొంగల పేరాస, వారానికి 75 వేలు చొప్పున స్త్రీలు, పిల్లలు, పురుషులూ చచ్చేటట్లు చేశాయి. అనేకవేల హిందువుల, ముస్లిముల కుటుంబాలు భగ్నమయేటట్లు చేశాయి బెంగాలు భూము లను రుద్రభూములుగా మార్చివేశాయి.

బెంగాల్‌కు పట్టిన దుర్గతియే భారతదేశానికంతటికీ పట్టే ప్రమాదంవుంది. కరువురాక్షసి యావత్‌దేశాన్ని మింగకాచుకొనివుంది. కరువుసూచకమైన వస్తు వుల కొఱత దేశమంతటా కనపడుతోంది. మృత్యువు మనల్ని జయిస్తుందా, లేక మృత్యువునే మనం జయిస్తామాఅన్న విషయేం వచ్చేసంవత్సరం నిశ్చయించుతుంది.

## దేశభక్తులు కోరేదేమిటి ?

ఈ క్లిష్టసమయంలో, మీవంక మీ గొప్పసంస్థ అయిన లీగ్‌వంక అందరూ కళ్లు విగిడ్చి చూస్తున్నారు.

మీరు అయిదురాష్ట్రాలలో మంత్రివర్గాలను కల్గియున్నారు.

వెనకనుండీ దేశభక్త సాంప్రదాయాలు మీలో వస్తూఉన్నాయి.

ముస్లిం ప్రజాసామాన్యంలో రోజురోజుకూ పలుకుబడి హెచ్చుతోంది. ఇటీవల రాష్ట్రబైయెలక్షన్‌లలో వారు మీకు అఖండ విజయాలను సాధించిపెట్టారు.

ముస్లింప్రజల బలమైన పపోర్టుఫలితంగా, జాతిని నడపగల గొప్పశక్తిగా నేడు మీరు పరిగణింపబడుతున్నారు.

ప్రతి ముస్లిమూ, ప్రతి భారతీయుడూ మీరేమి చేయాలని కోరుతున్నాడు?

అయిదురాష్ట్రాలలోని మంత్రివర్గాలు ప్రజామంత్రివర్గాలుగా ముందుకువచ్చి, స్వార్థపరుడైన తిండిదొంగనుండి, గర్విష్ఠమైన నిరంకుశోద్యోగినుండి ప్రజల ఆహారాన్ని కాపాడాలని కోరుతున్నాడు.

లీగ్‌మంత్రులు తిండిదొంగలపై యుద్ధంనడిపి, స్టాకుల సప్లయిలను ధరల కంట్రోలును అమలు పరిచేటట్లు చేయాలి. అలా చేసినపక్షంలో బీదప్రజలు ఆకలివల్ల చనిపోరు. ప్రజలను మృత్యుగహ్వరంలోకి తోసే తిండిదొంగలశక్తి సన్నగిలిపోతుంది.

మీరు ఇస్లాము సాంప్రదాయాలంటే గర్వపడతారు. అలా గర్వపడటం న్యాయంకూడా. అలాంటి ఇస్లాము సాంప్రదాయాల ప్రాతిపదిక ననుసరించి, ఆహారవిషయంలో బీదధనికభేదం లేకుండా అందరికీ ఆహారం దొరికేటట్టుచూడాలని అతడు కోరుతున్నాడు. అలా కోరడానికి అతనికి హక్కువుందికూడా. అందుచే వెంటనే రేషనింగును అమలు పరచాలి. రేషనింగువల్ల ప్రతివారికిఆహారం సమంగా లభించుతుంది.

ఆకలి — పస్తుపడివుండడం — చావు — వీటినుండి రక్షించమని మిమ్మల్ని మీ అధీనంలోవున్న మంత్రివర్గాలనూ కోరుతున్నాడు.

## ధరల కంట్రోలు - రేషనింగు

దీనినే బెంగాల్‌లీగ్ తీర్మానం కోరింది. ఢక్కా లీగ్‌సంఘం, అనేక ముస్లింలీగ్ విద్యార్థిసంఘాలు స్పష్టంగా ఈవిషయాన్నే కోరాయి. ఢిల్లీలో జరిగిన గత లీగ్ కౌన్సిల్‌లోకూడా ఇదే విస్పష్టమైన ధోరణి ప్రదర్శించబడింది.

ధరల కంట్రోలుకు. స్టాకుల కంట్రోలుకు, రేషనింగుకు అనుకూలంగా యావత్ భారత ముస్లిములు మాట్లాడారు. ఇతరులు కూడ ఇదే కోరుతున్నారు.

ఏప్రిల్ మహాసభలో లీగ్, ప్రజల తిండి కాపాడబడుతుందని అభయమిస్తూ తీర్మానించింది.

కాని దురదృష్టవశాత్తు ఈ తీర్మానం అమలులోకి రాలేదు. రాష్ట్ర ప్రజల జీవితం ఉంటుందా ఊడుతుందా అనే క్లిష్టసమయంలో, ముస్లిం లీగ్ పేరు ప్రతిష్ఠలకే ముప్పు వాటిల్లనున్న సమయంలో, పంజాబు యూనియనిస్టు భూస్వాములు తమ గోధుమలకు విపరీతమైనధరలు అడగడం మొదలుబెట్టారు.

పంజాబు మంత్రివర్గం ఈ ప్రజావిరుద్ధ వైఖరిని ఎదుర్కొని పోరాడకపోగా దానినే సపోర్టుచేసింది. పంజాబు మంత్రివర్గ ప్రధాని లీగ్‌సభ్యుడే. అయినా ఈ మంత్రివర్గం రేషనింగును. ధరల కంట్రోలును, స్టాక్సు కంట్రోలును వ్యతిరేకించింది. చివరకు వేవెల్ దెబ్బగొట్టేదాకా ఈవిషయంలో పంజాబు మంత్రివర్గం లొంగలేదు. పంజాబు మంత్రివర్గం నిరంకుశ ప్రభుత్వోద్యోగులకు తలయొగ్గింది. గాని, లీగ్ సమావేశపు తీర్మానాన్ని అమలుపరచక పోయింది.

లీగ్‌లోని ధనికవర్గాలవారు అంటే భూస్వాములు మొదలగువారు, బీదవారికి తిండి లేకుండాచేశారు. పంజాబులో బహిరంగంగా లాభాలుగొట్టువారినే రక్షించాలనే విధానం అవలంబించబడింది. ఈ ధనికవర్గం తమ స్వార్థలాభాలను రక్షించేందుకు మంత్రివర్గాన్ని ఒక కీలుబొమ్మగా పెట్టుకొంది.

లీగు దేశభక్తులారా!

అట్టి విధానం కొనసాగించ నీయడంఅంటే. ప్రజలను మాడ్చుటద్వారా నిరంకుశోద్యోగులు, తిండిదొంగలు, చేయుచున్న నేరంలో భాగంపంచుకోడం అన్నమాట. ఇది లీగ్‌యొక్క మంచి కీర్తిని అవమానపరుస్తుంది. ప్రజలముందు దాని పరువును పోగడుతుంది.

సాటిలేని ముస్లిం నాయకులైన మీరు అధికార పూర్వకంగా-ప్రజాభిప్రాయాన్ని తృణీకరించుటను — సహించమని మంత్రివర్గాలను హెచ్చరించాలి. ప్రజల ఆహారం పై లాభాలు గడించుటకు వీలులేదని తెలిజేయాలి.

ఆహారంకోసం ప్రజలు గావించే పోరాటాన్ని మీరు సురక్షితంగా నడుపుతారని ప్రజలకు వాగ్దానం చేసేదిగా — మీరు మంత్రివర్గాలకిచ్చే పిలుపు ఉండాలి.

# ఐక్యత — స్వయంనిర్ణయహక్కు

భారతదేశంలో రాజకీయ పార్టీలు కలిసేంతవరకు — కాంగ్రెసు లీగులతో గూడిన జాతీయ ప్రభుత్వం సంపాదించే వరకు — మన ప్రజలకు తిండి సమకూర్చడానికి, దేశాన్ని రక్షించడానికి జాతీయ ప్రభుత్వం ఏర్పడి ముందుకువచ్చేంతవరకు — మనచుట్టూ తాండవించే ఆకలిరాక్షసిని, మృత్యుదేవతను సరిగా ఎదుర్కొనజాలం.

కాంగ్రెసుకు వ్యతిరేకంగా లీగును, లీగుకు వ్యతిరేకంగా కాంగ్రెసును పురిగొల్పుతూ, నిరంకుశ ప్రభుత్వం అడ్డు ఆపు లేకండా ప్రవర్తించుతోంది. అధికారాన్ని వదులుకోకుండా ప్రతిష్టంభనా విధాన్ని కొనసాగించుతోంది. దానిఫలితంగా వేలకొలది మన దేశవాసులు మరణించుతున్నారు. భారతదేశమే నశించిపోతోంది.

ప్రతిష్టంభనా విధానాన్ని ఓడించి, ముఖ్య పార్టీలైన కాంగ్రెసు లీగులతో గూడిన జాతీయ ప్రభుత్వాన్ని ఇచ్చేటట్లు నిరంకుశ ప్రభుత్వాన్ని లొంగదీయనంతవరకు — భారతీయులు స్వాతంత్ర్య గమ్యస్థానాన్ని చేరలేరు; ముస్లిములు స్వయం నిర్ణయహక్కును సంపాదించలేరు.

అందుచేత మీక్షేమాన్ని మనస్సులో ఉంచుకొన్నట్టయితే, స్వయంనిర్ణయ హక్కును, అధికారాన్ని చేపట్టాలనే ఆశయాన్ని మనస్సులో వుంచుకొన్నట్లయితే మీ ప్రధానబాధ్యత కాంగ్రెసునాయకులను విడుదలచేయండని కోరడం - కాంగ్రెసుపై నిషేధం తొలగించమని కోరడం. అలా చేసిన పక్షంలో, మీరును విడుదలైన కాంగ్రెసు నాయకులూ కలిసి దేశాన్ని కరవుబాధనుండి మృత్యువునుండి తప్పించగలరు; దేశానికి తిండీ, స్వాతంత్ర్యమూ సమకూర్చగలరు.

మీ రవలంబించిన తటస్థవిధానమూ, మీరు జోక్యం కల్గించుకొనకపోవడమూ, మిమ్మల్నీ ప్రజలనీ దెబ్బకొట్టింది. పై విధానం స్వయంనిర్ణయ హక్కు గమ్యస్థానానికి చేర్చిందా? స్వాతంత్ర్యాన్ని సమీపానికి తెచ్చిందా? ప్రజలకు తిండి పెట్టిందా? లేదని చెప్పాలి.

నిరంకుశ పరిపాలనక్రింద భారతదేశం క్రుంగిపోతోంది. కాని దానినితప్పించే మార్గాన్ని మీరు వెదకడంలేదు.

ఆకలిబాధతో క్రుంగి కృశించే మనసోదరీసోదరులు, స్వాతంత్ర్యం, స్వయం నిర్ణయహక్కును కోరే మనప్రజలు, మీదేశభక్తి సాంప్రదాయాలకు తగినట్లు నిలబడి ప్రజలను రక్షించవలసిందిగా మిమ్మల్ని కోరుతున్నారు. కాంగ్రెసు నాయకులను విడుదల చేయవలసినదిగా మీరు కోరాలని

మిమ్మల్ని అడుగుతున్నారు. మీరు అలా కోరినపక్షంలో, నిరంకుశ ప్రభుత్వంపని అంతమవుతుంది. మీస్వయం నిర్ణయహక్కుకు ముస్లింలనుండి హిందువులనుండి అప్రతిహతమైన సపోర్టు వస్తుంది.

కాంగ్రెసునాయకులను విడుదల చేయండని పిలుపు. ఒకపక్షం తర్వాత మరొకపక్షాన్ని అణచివేసే నిర్బంధవిధానానికి - ప్రజలను మలమలమాడ్చి చంపే విధానానికి - అంటే ప్రతిష్ఠంభనకు - అంత్యక్రియలు చేస్తుందన్నమాట.

అది బ్రహ్మాండమైన ఐక్యతకు-కాంగ్రెసు లీగులు కేంద్రంలో అధికారం స్వీకరించే జాతీయప్రభుత్వానికి మనప్రజలకు తిండిపెట్టగలిగే ప్రభుత్వానికి-జపాన్ దురాక్రమణనుండి దేశాన్ని రక్షించగలిగే ప్రభుత్వానికి-దారితీస్తుంది.

మీసంస్థ దినదినమూ బలపడుతున్నందుకు సంతోషించుతున్నాం.

బహుళ సంఖ్యాకప్రజలు మీలో విశ్వాసాన్ని ప్రదర్శించుతున్నారు. స్వయం నిర్ణయహక్కంటే భారతదేశాన్ని చీల్చడం అని భావించడానికి బదులుగా, అది ఒక ప్రజాస్వామ్య కోరిక అని క్రమక్రమంగా గుర్తిస్తున్నారు.

మనదేశంలో రెండవ దేశభక్తసంస్థ దినదినమూ పెరుగుటజూచి సంతసించనివారెవ్వరు?

అయినప్పటికీ చిత్తశుద్ధిగల లీగు సభ్యులంతా ఒకవిషయం అంగీకరించక తప్పదు. లీగును ముస్లింప్రజల ప్రజాస్వామ్యసంస్థగా వృద్ధిచేయడానికి చేయవలసినదంతా చేయలేదు.

లీగు ఇంకా ప్రజాబాహుళ్యంలోకి చొచ్చుకుపోవాలి. లీగ్ఇచ్చే పిలుపు ప్రతి ముస్లిం కుటుంబానికి చేరాలి. లీగుపాలసీ ప్రతిముస్లిం హృదయంలోను ప్రతిధ్వనించాలి.

తన తిండిని లీగు రక్షించుతుంది — ధరలకంట్రోలుకు, రేషనింగ్‌కు, కార్మికుల కర్షకుల హక్కులకు, లీగ్ పోరాడుతుంది — స్వయంనిర్ణయ హక్కుకు, భారతదేశస్వాతంత్ర్యానికి లీగ్ పోరాడుతుంది — కాంగ్రెసు లీగ్‌ల ఐక్యతకు జాతీయ ప్రభుత్వానికి లీగ్ కృషిచేస్తుంది — అని ప్రతి ముస్లిమూ భావించేటట్లు లీగు చేయగలిగినట్లయితే, లక్షలకొలది ముస్లిము ప్రజలు ఒక్కతాటిమీద నిలచి లీగ్‌ను బలపరుస్తారు. లీగ్ ఆజ్ఞలను శిరసావహించుతారు. లీగ్‌ను అప్రతిహతంగా చేస్తారు.

ఇస్లామిక్ సాంప్రదాయాలనుండి ఉద్భవించిన ప్రజాస్వామ్య స్వాతంత్ర్యభావాలను గురించి మీరు సహజంగా గర్వపడుతుంటారు. అది న్యాయంకూడా. అలాంటి మీరు, ఇస్లామిక్ దేశాలభవిష్యత్ స్వాతంత్ర్యం మీచేతులలో వుందని గ్రహించాలి.

పాలస్థయిన్‌గాని, ఇరాక్‌గాని, భారతదేశం విముక్తిచెందనిదే - ముస్లిం జాతులు స్వయంనిర్ణయాధికారాన్ని సంపాదించందే - స్వాతంత్ర్యాన్ని పొందలేవు.

కాంగ్రెసులీగులు కలసి నిరంకుశ ప్రభుత్వాన్ని ఓడించి జాతీయప్రభుత్వాన్ని నెలకొల్పకపోతే, భారతదేశానికి స్వాతంత్ర్యంరాదు.

## అంతా మీచేతుల్లో వుంది

ఇస్లామిక్ ప్రపంచ స్వాతంత్ర్యానికి మార్గం మీ చేతుల్లోవుంది. కాంగ్రెస్ లీగు ఐక్యతకు, జాతీయ ప్రభుత్వానికి, ప్రతిష్ఠంభనను అంతం చెయ్యడానికి మూలం మీ చేతులలోవుంది.

ఐక్యం గాకపోవడం అంటే అర్థం, మీరుచెప్పే స్వాతంత్ర్యం ప్రజాస్వామ్యాలు వుత్తవన్నమాట. ఐక్యం గాకపోవడంఅంటే అర్థం, స్వయంనిర్ణయ హక్కుకు విరుద్ధంగా — భారత స్వాతంత్ర్యానికి విరుద్ధంగా — ఇస్లాందేశాల స్వాతంత్ర్యానికి విరుద్ధంగా — పనిచేయడమన్నమాట.

కాంగ్రెసు నాయకులను విడుదల చేయడానికి ఐక్యం గాకపోవడమంటే అర్థం — మన ప్రజలను ఆకలినుండి మృత్యువునుండి తప్పించగలమనే తుది ఆశను భగ్నం చేయడం అన్నమాట.

## భారతదేశం మీవంక చూస్తోంది

ధరలకంట్రోలు ద్వారా, రేషనింగ్ ద్వారా ప్రజలకు ఆహారాన్ని భద్రపరచమని మీ మంత్రివర్గాలను కోరండి.

జాతీయ ప్రభుత్వం సంపాదించడానికి అవసరమైన జాతీయ ఒడంబడికకై, కాంగ్రెసు నాయకుల విడుదలను కోరండి. తద్వారా మీ ప్రజలకు స్వయంనిర్ణయాధికారం వస్తుందని హామీ నివ్వండి.

లీగ్‌ను ప్రజాస్వామ్య ముస్లిం ప్రజాబాహుళ్య సంస్థగా మార్చి, దాని దేశభక్త సాంప్రదాయాలను నిలబెట్టండి.

# VII

## స్వయం నిర్ణయసూత్రంపై కాంగ్రెసు దృక్పథం

i. 1942 ఏప్రిల్ 2వ తేదీని ఢిల్లీలో జరిగిన కాంగ్రెసు వర్కింగ్‌కమిటీ తీర్మానంలోని భాగం.

"భారతస్వాతంత్ర్యంకోసం, భారత దేశఐక్యతకోసం కాంగ్రెసునిలబడివుంది. ఈ ఐక్యతలో చీలికరావడమంటే - ముఖ్యంగా ప్రపంచ ప్రజలంతా ప్రపంచఐక్యత నిర్మించాలని కోరే ఈ నవీనయుగంలో ఈ చీలికరావడమంటే — చాల ప్రమాదకర మైన సంగతి. అయినప్పటికీకూడ భారతయూనియన్‌లో ఏ ఒక్క ప్రదేశంలోని ప్రజలనుకూడా వారికి ఇష్టంలేకుండా బలవంతంగా ఒక యూనియన్‌లో ఉండే టట్లు కాంగ్రెసు వర్కింగుకమిటీ ఆలోచించజాలదు. ఈ సూత్రాన్ని అంగీకరిస్తూ వివిధ ప్రాంతాల (యూనిట్ల)లోని ప్రజలు జాతీయ జీవనం పరస్పర సహకారం తోను, సన్నిహితంగాను గడచిపోవడానికి తగిన పరిస్థితులను కల్పించడానికి అన్ని విధాలా ప్రయత్నించవలసి వుంటుందని ఈ కమిటీ భావిస్తోంది. ఈసూత్రం అంగీ కరించడమంటే దాని అర్థం, ఆయాప్రాంతాలలో ఏర్పడివున్న గ్రూపులపై బలవం తంగా వుండేటటువంటిగాని, మరికొన్ని లేనిపోని సమస్యలను తెచ్చిపెట్టేటటు వంటిగాని మార్పులు చేయకూడదు. యూనియన్‌లోవుండే ప్రతి ప్రాంతీయయూని ట్‌కి సాధ్యమైనంత సంపూర్ణ స్వపరిపాలన స్వాతంత్ర్యం వుండాలి.

ii. 1942 ఆగస్టు 7 వ తేదీని బొంబాయిలో సమావేశమైన అలిండియా కాంగ్రెసుకమిటీ తీర్మానంలోని భాగం.

"........భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రకటింపబడితే వెంటనే ఒక తాత్కా లిక ప్రభుత్వం ఏర్పాటు చేయబడుతుంది. అప్పుడు భారతదేశం మిత్రమండలిలో ఈ ప్రపంచ స్వాతంత్ర్య పోరాటంలో కష్టనిష్ఠూరాలను భరించే ఒక భాగస్వామి అవుతుంది. అట్టి తాత్కాలిక ప్రభుత్వం, దేశంలోని ముఖ్యమైన పార్టీల, గ్రూపుల సహకారంతోనే తప్ప ఏర్పాటు చేయబడజాలదు. అవిధంగా ఆ ప్రభు త్వం, దేశంలోని ముఖ్యమైన తరగతుల ప్రజలందరియొక్క ప్రాతినిధ్యం వహిం చిన సంయుక్త ప్రభుత్వంగా వుంటుంది. ఆ ప్రభుత్వంయొక్క ప్రధానకర్తవ్యం తన అధీనంలోనున్న ఆయుధ శక్తితోను, అహింసాత్మక శక్తితోను, మిత్రమండలియిచ్చే సహాయంతోను దేశాన్ని రక్షించడం, దురాక్రమణలను అరి కట్టడం అయివుంటుంది. అంతేగాక న్యాయంగా ఎవరికైతే సర్వాధికారాలువుండాలో అట్టి కష్టజీవుల — రైతుల కార్మికుల — అభివృద్ధికోసం పనిచేయడంకూడా

ఆ ప్రభుత్వ కర్తవ్యం. ఈ తాత్కాలిక ప్రభుత్వం అన్ని తరగతుల ప్రజలకు ఆమోదకరంగా వుండేలాగ భారతప్రభుత్వ కాన్స్టిట్యూషన్ తయారుచేయడానికి ఒక కాన్స్టిట్యూయంట్ ఎసెంబ్లీని ఏర్పాటుచేయడానికి ఒకప్లాను తయారుచేస్తుంది. కాంగ్రెసు దృక్పథం ప్రకారం ఈ కాన్స్టిట్యూషన్ ఫెడరల్ విధానంగావుండాలి. సంపూర్ణ స్వపరిపాలనా స్వాతంత్ర్యంగల్గి రెసిడ్యుయరీ అధికారాలు పొందియున్న యూనిట్లతోకూడిన ఈ ఫెడరేషను, ఆయా యూనిట్ల పరస్పర సహకారంకోసం అభివృద్ధికోసం, దురాక్రమణలను ఐక్యప్రజాబలంతో ఎదిరించి దేశాన్ని కాపాడు కోడానికి, ఆ ప్రతినిధులందరిని సంప్రదించి భారతదేశానికి మిత్రమండలి దేశాలతో భవిష్యత్తులో ఎటువంటి సంబంధాలుండాలి ? అనేది నిర్ణయించబడుతుంది."

iii. 1944 మార్చి 14 వ తేదీని అల్హాబాదులో సమావేశమైన యు. పి. కాంగ్రెసు నాయకులు ఇచ్చిన స్టేటుమెంటులోని భాగం.

కాంగ్రెసు యెడలను, కాంగ్రెసుకోరే స్వాతంత్ర్యం యెడలను, ముస్లింలీగు నాయకులలో రోజురోజుకు ఎక్కువ అవుతూవున్న ఎడబాటు భావానికి మేం చాలా విచారపడుతున్నాం. 1942 ఏప్రెల్ 2 వ తేదీని కాంగ్రెసు వర్కింగుకమిటీ తీర్మానాన్ని మరోసారి గమనించవలసినదిగా ముస్లింలీగును కోరుతున్నాం. ఆ తీర్మానంలో స్వయం నిర్ణయసూత్రం అంగీకరింపబడింది. స్వతంత్ర భారత యూనియన్‌లో ఏయూనిట్‌నుకూడా సభ్యులుగా వుండితీరాలనే బలవంతం ఏమీ వుండదనికూడా స్పష్టంగావించబడింది.

54

ఈనాటి సోవియట్ రష్యా సమగ్ర జీవితాన్ని తెలుసుకోన

# ఈక్రింది పుస్తకాలు తప్పక చదవండి

## నేటి సోవియట్ యూనియన్

కంభంపాటి సత్యనారాయణ (సీనియర్)

వెల 3—0—0

ఇందులో సోవియట్‌యూనియన్ ఆర్థిక, రాజకీయ, సామాజిక విధానాన్నిగురించి వి రింపబడింది. 200 సంవత్సరాలనుండి క్రుంగి కృశించుతున్న మనదేశానికి 25 సం॥ లం సోవియట్ ప్రజలుపొందిన అభివృద్ధి మార్గదర్శకమని చెప్పవచ్చు.

## సోవియట్ విదేశాంగనీతి : భారతదేశం

కంభంపాటి సత్యనారాయణ (జూనియర్)

వెల 0—10—0

ప్రపంచ ప్రజలందరితోబాటు మనకుగూడ సోవియట్ రాజకీయాలు ఎలా తోడ్పడిం తెలియజేయుటకు యీపుస్తకంలో ప్రయత్నించబడింది. సోవియట్ విదేశరాజకీయాలన గురించి యీ పుస్తకాన్ని చదువుటవల్ల ప్రస్తుతం సోదర దేశభక్తులను ఎదుర్కొంటున్న అపో హలు తొలగగలవు.

## సోవియట్ స్త్రీలు

(మాతృక : టి. సెరెబ్రెనికోవ్)

అనువాదం : దర్శి సుభద్రమ్మ

వెల 0—10—0

సోవియట్‌భూమిలో మహిళలుపొందే సౌకర్యాలు, అభివృద్ధిచెందడానికి వున్న అ కాశాలు యీ పుస్తకంలో వివరించబడ్డాయి.

సోవియట్ జీవితంలో స్త్రీకి గౌరవప్రదమైన స్థానం వుందని యీ పుస్తకం ఋజు చేస్తుంది. వివిధరంగాలలో పేరొందిన వీరవనితల చరిత్రలను తెలియజేస్తుంది.

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | NPR01B166 | Date | 28/3/2022 |
| Front Cover | Yes | Back Cover | Yes |
| Blank Pages | CI 15:3 | | |
| Missing Pages | NO | | |
| Prepared By | MALLESWARI | Cutting By | MALLESWARI |
| Scanned By | [signature] | Pages | 65 |